# సరసాల్లో నవరసాలు

**2వ భాగము**



రచన

**డా॥ మోపిదేవి కృష్ణస్వామి**



ప్రచురణ

**యూనివర్సల్ హ్యుమానిటేరియన్**
**ఎడ్యుకేషన్ ట్రస్టు**

**16-8-1 ఆఫీషియల్ కాలనీ**

**మహారాణీపేట - విశాఖపట్టణము - 530002**

ప్రథమ ముద్రణము
1988 మే — గురుపూజలు

ప్రతులు- 3000



ముద్రణ- "రాఘవేంద్ర"
నిర్వహణ- "వికాస్ ప్రింట్"
వెల-సాదా ప్రతి రు. 10-00
మేలు ప్రతి 15-00



ప్రతులకు :

యూనివర్సల్ హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు

16-8-1
అఫీషియల్ కాలనీ, మహారాణిపేట
విశాఖపట్టణము-2

23-10-7
పురుషోత్తంవీధి
సత్యనారాయణపురం
విజయవాడ-11



స మ ర్ప ణ

అమ్మగారి దివ్యసన్నిధికి
నిం డు మ న సు తో

## ఇందులో...

అమ్మా !

మాష్టరు గారూ మీరూ
కాసేపు అలా సరదాగా
మాట్లాడుతున్నప్పుడు
ఎంతసేపైనా వినాలనిపించేది
ఇంకెన్ని చెణుకులు పడతాయోనని
చెవులు పెద్దవి చేసికొని మరీ కూర్చునేవాడిని
గుర్తున్నాయి కదమ్మా ఆ సన్నివేశాలు ॥

గురు శిష్యులం మేమిరువురం
ఏదో అంశం మీద అయిన కాడికి
సాగదీస్తున్నప్పుడు చూచి చూచి
మీరు ఒక్క చెణుకు విసిరేవారు
అంతే! ఆ సాగదీయడం ఆగిపోయేది
మీ చెణుకు మాత్రం మిగిలిపోయేది
మరచిపోలేం కదమ్మా! ఆ సందర్భాలను

మీ మాటల కోసమే మీ రన్నం పెడతానంటే
వద్దని అనలేకపోయే వాడిని
అన్నం తింటూ మీ మాటలు వింటూ ఉంటే
అనంత విశ్వానికి సందేశమిచ్చే మాష్టరుగారు
అప్పుడు మాత్రం మీకు దొరికి పోతూ ఉంటే
అదో ఉల్లాసం, అదో సంతోషం, అదో అనుభూతి కదమ్మా॥

ఎంతవరకు కనబడాలో అంతవరకే కనబడి
ఎంతవరకు వినబడాలో అంతవరకే వినబడి
అంతలోనే ఏమీ తెలియనట్లు
మీ పనిలో నిమగ్నమయ్యే వారు మీరు
ఎంత ఔచిత్యవంతమైనదమ్మా మీ పాత్ర పోషణ
ఎంత ఆదర్శ ప్రాయమైనదమ్మా మీ దాంపత్య జీవితం ॥

అమ్మా మీరు !

ఎంతటి సరసులో
అంతటి సమర్ధులు
ఎంతటి సమర్ధులో
అంతటి సమన్వయ మూర్తులు
ఎంతటి సమన్వయ మూర్తులో
అంతటి సహృదయులు
ఎంతటి సహృదయులో
అంతటి ప్రేమ స్వరూపులు ॥

అక్కయ్య గారు గా పిలవబడుతూనే
అమ్మగార్గా అందరి హృదయాలలో
అలవోకగా అచిరకాలంలో
స్థిరపడిన దివ్యత్వమమ్మా మీది ॥

అమ్మ అన్న స్థితికన్న అమృత స్థితి మరి యేదీ?
అమ్మ సన్నిధికన్న ఇంక కావల్సినదేమున్నదీ?
అందుకే ఆ సన్నిధికే ఆ పెన్నిధికే
ఈ కృతిని సమర్పించుకొంటున్నాను.
మీ లాగే మేమూ నవ్వుతూ సాగిపోవాలనీ
ఆ సరసాల్లోనే సర్వకార్యాలు సాధించబడాలనీ
ఆశీర్వదించండమ్మా. ॥

---

ఈ గ్రంథంలో 'మాష్టరుగారు' అని వచ్చినపుడల్లా శ్రీ కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య గారిని ఉద్దేశించి అనీ, 'అక్కయ్యగారు' అని వచ్చినవుడల్లా 'అమ్మగారు' అనగా మాష్టరుగారి శ్రీమతిగారిని ఉద్దేశించి అనీ గ్రహించవలసినదిగా మనవి.

---

## ఇది పన్నీటి జల్లు

పదార్థము యొక్క తత్త్వాన్ని ద్రష్టలైన మహానుభావులు గ్రహిస్తారు. ఈ గ్రహించే శక్తి ప్రతిభాగుణం కలవారికుంటుంది. దృశ్యమాన జగత్తును ఒక మహా విజ్ఞానపు ఖనిగా పూర్వ ఋషులు దర్శించారు. కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు రచించిన కావ్యాలను పరిశీలిస్తే వారెంతటి ద్రష్టలో సహృదయులు గ్రహింపగలరు. నలువది యొక్క సంవత్సరముల పూర్వం కృష్ణమాచార్యులు గారి తొలికావ్యాన్ని గురించి విశ్వనాధ సత్యనారాయణగారు "పూవు పుట్టినంత తావి గుబాళించునన్న పలుకు తధ్యమయ్యెనిచట" అని తమ ఆమోదాన్ని తెలియజేశారు. ఆధ్యాత్మికంగా, సాహిత్య విషయకంగా పరమోన్నత స్థితినందుకొన్న కృష్ణమాచార్యుల గారి యొక్క శక్తిని, ఆనాడే సత్యనారాయణ గారు గ్రహించడం ఈనాడు మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

డాక్టరు మోపిదేవి కృష్ణస్వామిగారు ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి శిష్యులు. వారిద్దరూ కలిసి అనేక కార్యక్రమాలతో పాల్గొంటున్నప్పుడు వారి మధ్య సాగిన ప్రసంగాలలో దొరలిన చమత్కారములను "సరసాల్లో నవరసాలు" అనే గ్రంధంగా రూపకల్పన చేశారు. ఇది యొక చమత్కార చంద్రిక.

రసార్ణవ సుధాకర కర్తయైన సర్వజ్ఞ సింగ భూపతిని వర్ణిస్తూ విశ్వేశ్వర కవి ఇట్లా చమత్కరించాడు.

సింగప్రభురలంకారీ లంకారీ రాఘవః పునః
వర్ణాంతరత్వముభయోః శ్రూయతే సర్వ సమ్మతమ్.

సింగప్రభువు అలంకారి అంటే అలంకార శాస్త్రవేత్త. రాముడు లంకారి. ఇద్దరికీ ఒక్క వర్ణమే తేడా. వర్ణము అనగా అక్షరం, కులం, అని అర్ధము. అలంకారి-లంకారి అను శబ్దాలకు తేడా ఒక్క 'అ' అనే అక్షరమే అట్లే శ్రీరాముడు క్షత్రియుడు సింగప్రభువు చతుర్థకులజుడు ఇద్దరిమధ్యా ఒక్క వైశ్యకులమే అంతరం ఈ విధంగా మనపూర్వ మహాకవుల చమత్కారములు పరమ ప్రౌఢంగా ఉంటవి. తెనుగు సాహిత్యంలో ఇట్టి విద్యయందు చేమకూర వేంకటకవి అనన్య సామాన్యుడు.

ఉత్తమ కవులందరూ చమత్కార సంభాషణా చతురులే! చమత్కారం కొఱకే అన్నట్లున్నచో దాని వలన ప్రయోజనముండదు. ఎక్కిరాల వారి చమత్కారంలో ఒక పరమార్థం దాగి ఉంటుంది. ఈ గ్రంథంలో ఇరువదిరెండు శీర్షికలున్నవి ఏశీర్షికకాశీర్షిక రమణీయార్థాన్ని ప్రతిపాదిస్తూనే ఉంటుంది. వాటినన్నిటినీ వివరించడం ఇక్కడ వీలుపడదు.

మందుకోసం వచ్చిన కృష్ణస్వామి గారిని చూచి ఏమిటలా మందస్మితం చేస్తున్నావు ? అని డాక్టరు కృష్ణమాచార్యులు గారు అంటే మందస్మితం కాదిది. మందుస్మితం అని కృష్ణస్వామిగారు ఇచ్చిన సమాధానం చదువరులకు ఆనందాన్ని కలిగించి తీరుతుంది.

"మామూలు కవుల కావ్యాల్లో రెండు మూడు పద్యాల కొకచోటైనా, ఇలన్, ఇద్ధరన్, ధరిణిన్, భూమిలోన్, ధాత్రిన్ అంటూ ఏదో ఒక రూపంలో భూమిని గూర్చిన స్మరణ ఉంటుంది. దానికే నవ్వుతూ ఈ కవులకు కావ్యాల్లో భూవసతి ఎక్కువగా ఉంటుంది అన్నాను. నిజానికి సొంత ఇల్లూగోడూ, అమర్చుకో గలిగారో లేదో గాని

కావ్యాల్లో మాత్రం యథేచ్ఛగా భూమిని ఆక్రమించేస్తూ ఉంటారు వీళ్లు. ఈ భూమంతా మాదే అన్నట్లు" ఈ వాక్యాలు "కవులకు భూవసతి" లోనివి. పద్య రచనలో చేయి తిరుగని కవులు పడే శ్రమను ఇక్కడ భంగ్యంతరేణ, చమత్కారం గా చెప్పడం జరిగింది.

గురు శిష్యుల మధ్యసాగిన "సరసాల్లో సపరసాలు" సహృదయు లకు పన్నీటి జల్లు కాగలదు.

కృష్ణమాచార్యులుగారు నాకు సతీర్థ్యులు. ఆ మహనీయునితో నాకున్న పరిచయం కారణంగా, ఈ గ్రంధానికి పరిచయ వాక్యాలు వ్రాయు అదృష్టం కలిగింది.

గుణవద్వస్తు సంసర్గంచేత స్వల్ప వస్తువు కూడా గౌరవం పొందుతుంది. పూలతో కూడి యుండడం వలన దారము కూడా శిరస్సున ధరింపబడుతుంది గదా !

విజయవాడ | ఇట్లు
21-5-198/ | కోటగిరి విశ్వనాథరావు

# జీవితం కళకళలాడాలి.

నవ్వుతూ జీవించడం ఒక కళ. ఆ కళ అబ్బకపోతే జీవితాని కసలు కళే ఉండదు. జీవితం కళకళలాడాలి అంటే మనం నవ్వుతూ మనతో ఉన్న వాళ్ళను నవ్విస్తూ ఉండగలగాలి.

మనిషి నవ్వుతున్నాడు. అంటే నవ్వుతున్న క్షణాల్లో అతని మనస్సు హాయి ననుభవిస్తోందన్నమాట. కనుకనే నవ్వు మనిషిని ఆరోగ్యంగా నిలబెడుతుందని మన పెద్దవాళ్ళు చెప్పారు. కొందరు సీరియస్ గా చేస్తే గాని పనులు కావను కుంటారు. ఆ పనిలో ఉన్న మిగతా వాళ్ళను కూడా సీరియస్ గా ఉండకపోతే పనెలా అవుతుంది అంటూ గద్దిస్తూ ఉంటారు. ఇదంత మంచి లక్షణం కాదు. నవ్వుతూ చేస్తే పని హాయిగా అయిపోతుంది. సీరియస్‌గా చేస్తే పని చెడిపోయే ప్రమాద ముంది. పని చెడడమే కాదు అలా చేయడం వల్ల ఆరోగ్యం కూడా చెడి పోతుందని పెద్దలు గమనించారు. సీరియస్ గా పని చేస్తున్నప్పుడు మనిషి శక్తిని కోల్పోతాడు. నవ్వుతూ పనిచేయగలిగితే మనిషి మరింత శక్తిని పొందుతాడు. జీవితంలో ఈ సుళువు తెలియాలి. మనసారా మనం నవ్వగలగాలి. ఇంకొంచెం ఎదిగి చూస్తే చెరగని చిరునవ్వుతో జీవించ గలగడాన్నే మన పెద్దలు మోక్షం అని పిలిచారని మనకు తెలుస్తుంది. సీరియస్‌గా మొహం మాడ్చుకుని జీవించడం కన్నా బంధం అంటే ఇంకేమిటి చెప్పండి ? కనుక సీరియస్‌గా కాకుండా నవ్వుతూ హెచ్చరిస్తున్నాం. ఎప్పుడూ సీరియస్‌గా జీవించడానికి ఇష్టపడకండి అని!

ఒక పిల్లవాడు పరుగెత్తుతూ పరుగెత్తుతూ ఇంకో పిల్లవాడి కాళ్ళ తగిలి పడిపోయాడు. మిగతా పిల్లలంతా నవ్వారు. ఆ పడిన వాడు మాత్రం వాడి బాధలో వాడున్నాడు. ఒక పిల్లవాడు చొక్కాకు ఉన్న గుండీలను ఎగుడు దిగుడుగా పెట్టుకుని బడికి వచ్చాడు. మిగతా పిల్లలంతా నవ్వుతున్నారు. ఎందుకో చెప్పరు! ఆ పిల్లవాడు దీనంగా చూస్తూ నిలబడ్డాడు. ఎప్పటికో చూపించారు వాళ్ళ గుండీల వైఖరిని ఇదీ కారణం అంటూ పాపం ఆ పిల్లవాడు చిన్నబుచ్చుకున్నాడు. పిల్లలేమిటి పెద్దలు కూడా ఇలాంటి సన్నివేశాలలో ఇలాగే ప్రవర్తిస్తూ ఉంటారు. మన ఎదుట నున్న వ్యక్తి కాని, వస్తువు కాని ఉండవలసిన స్థితిలో ఉండకుండా వికృతమైన స్థితిని పొందినపుడు హాస్యం పుడుతుందని పెద్దలన్నారు. నిజమే ఇలాంటి సన్నివేశాలలో నవ్వు వచ్చే మాట నిజమే కాని నవ్వకుండా సన్నివేశంలోని ఆ "ఒక్కడూ" మిగిలిపోతున్నాడే పాపం! ఇలా కాకుండా సన్ని వేశంలోనే అందరూ నవ్వుకోగలిగితే ఇంకా బాగుంటుంది కదా!

ఒక నలుగురు కలిసినపుడు అందులో ముగ్గురు నాలుగోవారు బలహీనతలను గూర్చి గేలిచేస్తూ హాస్యాన్ని సృష్టిస్తున్నారనుకోండి అప్పుడు నవ్వొస్తుంది. బాగుంది. మరి ఆ నాలుగోవాడి మాటేమిటి? ఈ ముగ్గురు తాము నవ్వుకోవడాని కని ఆ నాలుగో వాణ్ణి బలి చేస్తున్నారు కదా! మరి వాడి స్థితేమనాలి? ఆలోచించాలి! ఆ ఉన్న నలుగురూ మొత్తంగా నవ్వుకోగలిగితే ఇంకా బాగుంటుందేమో!

మనం ఎవరి మీద పరసమాడుతున్నామో ఆ వ్యక్తి కూడా మనతో పాటు మనంతగానూ నవ్వుకోగలగాలి. అప్పుడు పరసమాడడం మనకు

చేతవచ్చినట్లు లెక్క. ఇలా నూటికి నూరు పాళ్ళు ఎవరినీ నొప్పించ కుండా నవ్వించగలిగిన వారు, జీవితంలో ఒడుపు తెలిసినవారూ, తోటి వారి స్థానంలో తమను ఊహించుకోగలిగిన తీర్పరులూ అయి ఉంటారు. వీరినే మనం సిద్ధపురుషులు లేక ప్రవక్తలు అంటాం.

ప్రవక్తలు నవ్వుతారా, నవ్విస్తారా ? అని మనకనిపించవచ్చు. అసలువారెప్పుడూ నవ్వుతూనే ఉంటారు. కోపాన్ని నటించవలసి వచ్చి నపుడు తప్ప. బాధకు గురికావలసి వచ్చినపుడు తప్ప నిజానికి అప్పుడు కూడా వారు లోలోపల నవ్వుకుంటూనే ఉంటారు. తమపైన తామే సరసమాడుకోగల సమర్థులు వారు. అందరిపై సరసమాడి తమను మాత్రం వదిలిపెట్టుకుంటారా ? వదిలి పెట్టుకుంటే వాళ్ళు ప్రవక్తలవు తారా ?

ప్రవక్తల సరసంలో ఒక సహజమైన దివ్యత్వం ఉంటుంది. మంచి పువ్వులకున్న పరిమళం లాంటిదది. వారి సరసం ఎంతగా సంతోషాన్ని కలిగిస్తుందో అంతగా ఎదుటివారిని సంస్కరిస్తుంది. కూడా ! వాళ్ళకు సంబంధించిన ఒక కడగంటి చూపే, ఒక చిన్న చిరునవ్వే. ఎదుటివారికి కావలసిన ప్రబోధాన్నీ, పరితృప్తినీ అందించ గలదుకదా ! అలాంటిది సరసమైన వారి సంభాషణ సార్థకం కాకుండా ఉంటుందా ?

భగవద్గీతను సీరియస్‌గా కాకుండా సరదాగా చదుకోగలిగితే దానినిండా కృష్ణుడాడిన సరసాలెన్ని ఉన్నాయో గ్రహించడానికి వీలవు

తుంది. పాపమరిదిని తన చమత్కార సంభాషణలతో నవ్విస్తూనే సరి దారిలో పెట్టాడని మనకు తెలుస్తుంది. చాలామంది భగవద్గీతను ఒక శాస్త్రంగా మాత్రమే చదువుకుంటారు. అలాకాక ఒక దివ్యపురుషుని సరస సంభాషణగా చదువుకో గలిగితే ఎంత రసవత్తరంగా ఉంటుందో అప్పుడు తెలుస్తుంది. అలాగే ప్రవక్తలూ, పెద్దలైనవారి సంభాషణల్లో సరసం అంతర్లీనంగా ఉంటూనే ఉంటుంది. అందుకో గలిగిన వారికి అందుకున్నంతవరకూ అందుతూ ఉంటుంది.

సరసాల్లో నవరసాలు ఒకటవ భాగంలో ఒక ప్రవక్త మనతో ఆడిన సరస సంభాషణలు కొన్నిటిని రుచిచూపడం జరిగింది. ఆరుచి చూసినవారు తమ పులకింతలను తరచు తెలియచేస్తూ ఉండడంతో మరి కొన్ని ఆప్రవక్త ఆడిన సరస సంభాషణలను కూర్పుచేసుకొని ఈ రెండవభాగం వ్యక్తమయింది. ఇంత తొందరలోనే వ్యక్తమయింది అంటే రుచిఎరిగిన వారు దీని కొరకు అంత ఆతృతతో ఎదురు చూస్తు న్నారన్నమాట. నిజమైన గ్రంథాలు రచయితలచేత వ్రాయబడవు. ప్రజలు కోరి నిలచినపుడు రచయితలనుండి అవి వెలువడుతాయి.

సరసస్వరూపులైన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యను కోపిష్ఠిగా భావించేవారుకూడా కొందరు లేకపోలేదు. ఒకాయన అన్నాడు కదా ఆయనను ఎక్కిరాల అనడంకన్నా అగ్గిరాల అనడం మంచిదని. పాపం మాస్టరుగారికాయనెప్పుడు దొరికిపోయాడో! ఆయన కోప్పడు తున్నారని అనుకొని వింటే నే చెప్పలేను కాని సాక్షిమాత్రులమై నిలచి వినగలిగినపుడు ఆయన కోప్పడడంలో కూడా ఎంత సరసం దాగిఉందో బోధపడుతుంది. అందుకనే కొటోల ఆయనచేత కోప్పడబడినవారు ఆ

తరువాతి కాలంలో ఆ కోపాన్నీ, చివాట్లనూ తలుచుకుంటూ తమలో తామే నవ్వుకుంటూ ఉండేవారు. అవకాశం చిక్కితే ప్రక్కనున్న వాళ్ళకు కూడా చెప్పి వాళ్ళతో కలిసి ఆనందించేవాళ్ళు. అంటే ఏమిటన్న మాట? మాస్టరుగారి కోపంలోని సరసం వాళ్ళకి బోధపడిందన్నమాట. అందుకనే, అన్నీ కలిసొస్తాయనే ఈ గ్రంధానికి సరసాల్లో నవరసాలని పేరు పెట్టింది.

కొంచెం దగ్గరగా చూసినప్పుడు సరసమే నవరసాలుగా ఆయన నుంచి వ్యక్తమవుతున్నదీ! అది మనకు స్పష్టమవుతుంది. అలాంటి సరసాల్లో నవరసాలను కొంచెం కొంచెంగానైనా ఈ భాగాల రూపంలో పట్టి ఈయగలగడం అనేది జరుగుతున్నందుకు చాలా సంతోషంగా ఉంది. ఇదంతా మాస్టరుగారి అనుగ్రహ విశేషాన చదవరులందరూ కలకాలం నవ్వుకోవడానికి, నవ్వుతూ జీవించగలగడానికి, అంతకంటే ఈ జీవితానికి కావలసింది వేరేమీ లేదని తెలుసుకోవడానికి జరుగుతున్న కృషి.

చిత్రం. ఈ రచన ప్రారంభమైనప్పటినుంచి నేనూ, నాతో ఉన్నవారూ సరసాల్లో నవరసాలను వివిధ సన్నివేశాల రూపంలో అనుభూతి చెందుతూ రావడం అనేది పెద్దఎత్తున జరుగుతూ వస్తున్నది. ఇలాంటి మలుపు ఈ కథ ఎందుకు తిరుగుతున్నది? దానికీ ఈరచనకూ గల అనుబంధమేమిటి? అన్నది కాలపురుషుని రూపంలో మాస్టరుగారు విడమరచి చెప్పగలరు. మరి వారే కదా ఈ కథకు రచయితలు.

విజయవాడ
23–5–87

మోపిదేవి కృష్ణస్వామి

# మందస్మితం కాదిది ...

అవి నేను ఎం. ఏ. ఫైనల్ ఇయర్ చదువుతున్న రోజులు. మాస్టరుగారు అప్పటికి చినవాల్తేరు కాలనీలో ఉంటున్నారు. మాస్టరు గారి నుండి మందు తీసుకొందామని ఉదయమే బయలుదేరాను. ఆయన డిస్పెన్సరీ లో నుండి లేచేలోపున అక్కడకు చేరుకోవాలని నా ప్రయత్నం.

మొత్తం మీద చేరుకున్నాను. అదృష్టం కొద్దీ మాస్టరుగారున్నారు. డిస్పెన్సరీ దాదాపు పూర్తయినట్లుంది. ఆయన ప్రక్కనున్న సోదరులతో సరసమాడుతున్నారు. ఆ సోదరులు ఆ సరసవచనాలు పెడుతున్న గిలి గింతలకు తట్టుకో లేక మెలికలు తిరుగుతున్నారు.

నేను వెళ్లి ఎదురుగా నిలబడ్డాను. ఏమిటలా మందస్మితం చేస్తున్నావ్ ? అన్నారాయన. మందస్మితం' కాదిది మందుస్మితం అన్నాను నేను.

ఇంతసేపూ అందరినీ నవ్విస్తున్న మాస్టరుగారు ఇప్పుడాయన నవ్వును ఆపుకోలేకపోయారు. ఇవాళ రాత్రికి ఈ మందు వేసుకో అంటూ కేసుషీటు పైన మందు పేరు వ్రాశారు.

ఇక సెలవుతీసుకొంటాను అన్నట్లుచూసి పాదాలకు నమస్కరించ బోతున్న నన్ను వెన్ను పై చిన్నగా చరుస్తూ "కృష్ణస్వామీ ! నీ ప్రాసలకు చివరకు నా మందులు కూడ దొరికిపోయాయోయ్ ! మరీ ఈ మధ్యనీ బుద్ధి పాదరసంలా పనిచేస్తోంది" అన్నారు.

పాదాలను కళ్లకు అద్దుకొంటున్న నేను 'ఇదంతా తమ 'పాద' రసమే కదా! మాస్టరుగారూ' ! అన్నాను.

ఓరీ ! నా మందులే అనుకుంటే నా పాదాలు కూడా నీ ప్రాసలకు దొరికిపోయాయే ! అన్నారాయన.

మరి ! మీరే దొరికిపోయినపుడు ఇంకేవి దొరకవు ? అన్నాను నేను.

మొత్తం మీద ఉండవలసిన వాడివోయ్ ! అంటూ లాలనగా నా ముక్కును పట్టుకున్నారు మాస్టరుగారు.

## మీ పనీ అవుతోందిగా !

ఒకసారి అక్కయ్యగారిని తీసుకొని మాస్టరుగారు షాపింగ్ కని బయల్దేరారు. అరుదైన ఈ సన్నివేశంలో సహకరించిన అదృష్టానికి నోచుకుందామని సోదర బృందం లోని ఒకరు తమ కారుతో సిద్ధంగా ఉన్నారు.

"కృష్ణస్వామీ ! నువ్వు కూడా ఉండు. లేకపోతే అక్కయ్య గారికి నేనొక్కణ్ణే అయి దొరికిపోతాను" అన్నారు మాస్టరుగారు నవ్వుతూ.

ఆ మాటలను విన్న అక్కయ్యగారు. "ఇప్పుడు దొరికి పోవడ మేమిటి ? ఎప్పుడో దొరికిపోయారు" అన్నారు.

"అది కాదోయ్ నేనంటున్నది" అని మాస్టరుగారు ఏదో అన బోయేంతలోపున. అక్కయ్య గారు మళ్ళీ అందుకుని, "మీరంటున్నదీ అనబోతున్నదీ కూడా నాకర్థమయింది. అంతగా నేనారడి పెట్టదలచు కుంటే ఈ కృష్ణస్వామి అడ్డు పడగలదేమిటి? ఏం చెప్పినా ఈ కృష్ణస్వామి ఇయటి చెప్పాల్సిందే. అక్కయ్యగారి దగ్గరేం సాగవు" అన్నారావిడ చిరునవ్వు నవ్వుతూ. "కృష్ణస్వామేమిటి ? నా సంగతి అంతే కదా? " అన్నారు మాస్టరుగారు చిలిపిగా.

"ఆc ఆc ఏ ఆరడీ లేదు కనుకనే, ఇంతగా ఆట పట్టిస్తున్నారు. నిజంగా ఆరడే కనుక ఉంటే మీ ఈ ఆటలన్నీ సాగేవేమిటి?" అన్నారావిడ సరస గంభీరమైన స్వరంతో

"అదీ నిజమే అనుకో" అని ఆయన బుద్ధిగా ఒప్పేసుకుంటూ ఉండగా, మేమందరం కారెక్కేశాము.

అక్కయ్యగారు షాపులోపల కావలసిన వస్తువులను పరిశీలిస్తున్నారు. మాస్టరుగారూ, నేనూ కౌంటర్ దగ్గరే కూర్చున్నాం. కారులో మమ్మల్ని దింపిన సోదరుడు ఇప్పుడే వస్తానని చెప్పిచిన్న పని మీద వెళ్ళాడు. షాపు యజమాని మాస్టరుగారికి బాగా తెలిసినవాడే. ఆయన మెల్లిగా మమ్మల్ని కబుర్లలోకి దింపాడు. ఆ యజమాని ముఖంలో ఆనందం పొంగుకొస్తోంది. క్యూలలో గంటల తరబడి నిలబడినా, అవుతుందో కాదో చెప్పలేని మాస్టరుగారి దర్శనం తన షాపులో తన ముందే జరుగుతుందని ఆయన ఊహించి ఉండడు. ఊహించలేని ఆ అదృష్టం, దాని కదిగా లభించి నందుకు ఇక ఆయన ఆనందానికి అవధులు ఉంటాయా!

ఆ యజమాని డ్రింకులు అవీ తెప్పించాడనీ, ఎన్నెన్నో విధాల మమ్మల్ని సేవించడానికి యత్నించాడని వేరుగా చెప్పనక్కర లేదు కదా! డ్రింకు తీసుకుంటూ ఉండగా ఆయనిలా అన్నారు "మాస్టరుగారూ! మీరుకూడా ఒకకారు కొనేయకూడదూ? మీకెప్పుడు ఎటో అటు ప్రయాణాలు ఉంటూనే ఉంటాయికదా! చేతిలో ఒక కారు ఉంటే మీకు చాలా సౌకర్యంగా ఉంటుంది.

కాంతివంతమైన తమ కన్నులు చిత్రంగా త్రిప్పుతూ ఇలా అన్నారు మాస్టరుగారు : "నేను కారుకొనను. ఇండియాలో కారు కొన్నవాడు ఒక దురదృష్టవంతుడని నా అభిప్రాయం.

నరసంగా చూస్తున్నారు మాస్టరుగారు.

ఆశ్చర్యంగా చూస్తున్నాడా యజమాని.

అలా ఆశ్చర్యంలో అతన్ని ఎక్కువసేపు ఉంచడం ఎందుకని అనుకున్నారు కాబోలు, మాస్టరుగారే మళ్ళీ ఇలా కారణాన్ని వివరించ సాగారు : ట్రాఫిక్ రూల్స్ తెలియని, తెలిసినా పట్టించుకోని దేశంలో వాహనమున్నవాళ్ళు దురదృష్టవంతులుకాక మరేమవుతారు ? రూల్స్ పాటించే దేశంలో వాహనముండడం ఒక సౌకర్యం. రూల్సునుపా టించ డానికి ఇష్టపడని మనలాంటి దేశంలో వాహన ముండడం ఒక శాపం. ఏమంటారు ?

'అవునవు'న్నట్టుగా తల ఊపాడు యజమాని తన గత అనుభ వాలను మనస్సులో నెమరు వేసుకుంటూ.

ఇంకా వివరంగా చెబుతాను చూడండి అన్నట్టుచూస్తూ మాస్టరు గారు ఇలా అన్నారు :"మన దేశంలో నడుస్తున్నవాడు సైకిల్ తొక్కే వాడికి అడ్డం వస్తాడు. సైకిల్ తొక్కేవాడు రిక్షా తొక్కేవాడి కడ్డం వస్తాడు. రిక్షావాడు స్కూటర్ లాంటి వాహనాల వాళ్ళకు అడ్డువడతాడు. స్కూటర్లవాళ్ళు కార్ల వాళ్ళకు అడ్డం వస్తారు. కార్ల వాళ్ళు లారీలు మొదలైన వాటికి అడ్డు వస్తారు. ఇలా అందరూ అందరికీ అడ్డమై ఎవరూ ముందుకు సాగకుండా ఆగిపోతూ ఉంటారు. ఇదీ మన వాళ్ళ ప్రత్యేకత. రోడ్డుమీదకు వచ్చేది సాగిపోయేందుకు కాదు ఆగిపోయే టందుకు అన్నట్టు ఉంటుంది మనపద్ధతి."

"చాలా చక్కగా కళ్ళకు కట్టేటట్టుగా వివరించి చెప్పారు మాస్ట రుగారూ! మన స్థితిని. అందరూ అనుభవిస్తున్నదే అయినా అనుభ విస్తున్నదేమిటో చెప్పగలగడం మీ లాంటివారికే సాధ్యమవుతుంది" అన్నాడాయన.

"అందుకే ఆయన మాష్టారు గారయ్యారు" అన్నాన్నేను.

"నిజం నిజం" అన్నాడాయన అభినందనగా.

"మరి ఇప్పుడు కూడ నన్ను కారు కొనమంటారా?" అన్నారు మాస్టరు గారు.

"అనను, అనను మాస్టారూ! అనలేను" అన్నాడతను నవ్వుతూ.

ఇంతలో అక్కయ్యగారు పని పూర్తిచేసుకొని మా చెంతకు చేరుకున్నారు.

"ఓయ్ ! అక్కయ్యగారు వచ్చేస్తున్నారోయ్ ! ఇక మన 'ట్రాఫిక్' అదే మన 'టాపిక్' బంద్" అని మెల్లగా నాకు మాత్రమే వినపడేటట్లు అని అక్కయ్యగారికి కావలసినట్లుగా లేచి నిలబడ్డారు మాస్టరుగారు.

"మీ పని అయిందా ?" అన్నారు మాస్టరుగారు.

"మీ పనీ అవుతోందిగా !" అన్నారావిడ.

సరసమాడుతూ నిండుగా నిలబడిన ఆ దంపతులను చూచి ఆ యజమాని తన జన్మ ధన్యమైనట్లు చేతులు జోడించాడు.

వెళ్ళిన పని అయిపోయింది కాబోలు ఆకారులో తీసుకొని వచ్చిన సోదరుడు ఆ సమయానికి సాక్షాత్కరించాడు. డోరు తీసి రెడీగా నిలబడ్డాడు.

షాపు మెట్లు దిగుతున్న మాస్టరుగారు ఓరగా నావైపే చూస్తూ చిన్నగా నవ్వారు. ఇంతవరకూ జరిగిన కారు కథనంతటినీ గుర్తు తెచ్చే నవ్వది.

పాపం ఆసోదరుడి కేంతెలుసు ? సాదరంగా అలా ఆహ్వానిస్తూనే నిలబడ్డాడు.

కారు ఎక్కిన తరువాత కూడా కాయకథ గుర్తుకొస్తూనే ఉంది. ఒకరిని చూచి ఒకరం నవ్వుకుంటూనే ఉన్నాం. మాకు మాత్రమే అర్థమయ్యే నవ్వులవి. ఇక ఇప్పుడు మీకు కూడా!

  

## శిష్య పరంపర

మాస్టరుగారు ఆంధ్రా యూనివర్సిటీలో ఎమ్. ఎ. ఆనర్స్ చదువుతున్న రోజులవి. అప్పటికే విశ్వనాథ సత్యనారాయణ గారి దగ్గర ప్రధానమైన సంస్కృత, ఆంధ్ర కావ్యాలను అధ్యయనం చేసి ఉన్నారాయన. విశ్వనాథ సత్యనారాయణగారు, మాస్టరుగారి తండ్రిగారైన అనంతాచార్యగారు మంచి మిత్రులు, పరస్పరం ఆత్మీయతతో మెలిగే కుటుంబాలు వారివి తండ్రిగారికి మిత్రులు కావడం, తమకు కావ్యాలను ప్రత్యేకించి వివరించి చెప్పిన గురుమూర్తులు కావడంతో సత్యనారాయణ గారంటే మాస్టరుగారికి అపారమైన అభిమానం, ఎనలేని గౌరవం.

సత్యనారాయణగారు అప్పుడప్పుడు ఏవో పనులు మీద విశ్వవిద్యాలయానికి వస్తూ ఉండేవారు. ఆయన వచ్చినప్పుడల్లా ఆయా శాఖల్లో చదువుతుంటున్న శిష్యబృందం అంతా ఆయన చుట్టూ చేరి అర్థవంతమైన కాలక్షేపం చేస్తూ ఉండేవారు. చదువులకు కావలసిన సమయంపోను మిగిలిన సమయమంతా ఆయనతోనే. ఆయన ఎటు వెడితే

అటు. ఆయన ఎక్కడ ఉంటే అక్కడ. ఇది ఆయనతోడిదే వాళ్ళ కార్యక్రమం.

మాస్టరుగారు ఈ వెన్నంటి వచ్చే శిష్యబృందంలో కొట్టొచ్చినట్లు కనపడుతూ ఉండేవారు. ఆయన రూపానికున్న మహిమ అంతటిది. ఎందరిలో ఉన్నా ఒక ప్రత్యేకమైన వెలుగుతో వెలుగుతూ అందరి కన్నులనూ తమవైపునకు ఆకర్షించుకోగల దివ్యత్వం ఏదో ఆయనలో ఉంది. అని ఆనాటి నుండి మిత్రకోటి అనుకుంటూ ఉండేవారు. ఒకరోజున సత్యనారాయణగారితో కలిసి బృందం అంతా నడుస్తున్నారు. ఎదురుగా కొందరు మిత్రులు కలిసివస్తూ వీళ్ళనుచూసి ఎకసెక్కెంగా బయల్దేరా(రా శిష్యపరంపర అంటూ కామెంట్ చేశారు. వెంటనే మాస్టరుగారు లేచి ఇది శిష్య పరంపర కాదోయ్ శిష్య పరంపరా అన్నారు.

పరంపరగా మిగిలిపోవటంకాదు పరవర ముందుకు దూసుకుపోగలదు ఈ శిష్యగణం అన్న భావం ఆయన గొంతు నుండి ఆ పదాలు పలుకుతున్నప్పుడు వ్యక్తమయింది. ఈ వాక్యంతో ఆయన అటు ఎకసెక్కెమాడిన వారిని తిప్పికొట్టారు. ఇటు వెంట నడిచే వారికి ఉత్తేజాన్నిచ్చారు. ఒక్కదెబ్బకు రెండుపిట్టలను పడగొట్టగల చాకచక్యం ఆయనది. ఇంతకూ పరంపర అనే పదాన్ని పరంపర అని పలకడానికి వ్యాకరణం కూడా అడ్డు చెప్పదు.

  

# మనమేనండీ

ఆంధ్రా యూనివర్సిటీలో ఎమ్. ఎ. ఆనర్స్ చదివేరోజుల్లోనే మాస్టరుగారు ఒక సారి యూనివర్సిటీ డిస్పెన్సరీకి వెళ్ళారు. ఎక్కడకు వెళ్ళినా ఒక్కరే వెళ్ళడం ఆయనకు అలవాటులేని పనిగదా. మిత్ర బృందంతో కలిసి మరీ వెళ్ళారు. వారిలో ఒకరిద్దరికి డాక్టరుగారితో పని పడింది. ఆ ఒకరిద్దరికీ సాయంగా అందరూ బయల్దేరారు. బాధలో ఉన్న వాళ్ళకు ధైర్యం చెప్పే వాళ్ళే డాక్టరుకన్నా ముందు అవసరం కదా.

డిస్పెన్సరీలో ప్రవేశించిన మాస్టరుగారు అల్లంత దూరాన తమను ఎవరో పిలుస్తున్నట్లు గమనించి చేతిలోని పుస్తకాలను బల్లపైన పెట్టి అలా బయటకెళ్ళారు.

ఇంతలో ఆ డిస్పెన్సరీలోనే పని చేస్తున్న ఆరెళ్ళ రామ్మూర్తిగారు అటువైపు వచ్చారు. ఉన్నట్టుండి ఆయన కళ్ళు బల్లపైనున్న పుస్తకాలపైన పడ్డాయి. బల్లను సమీపించారు. పుస్తకాలను దగ్గరగా చూశారు. పైనున్న పుస్తకంపైన 'ఋతుగానం' అని పెద్ద అక్షరాలు కనపడుతున్నాయి. ఏమిటో ఆ పుస్తకం చూడాలని పించిందాయనకి. పుస్తకం తెరిచారు. అది పద్యకావ్యం ఋతువులను గూర్చిన వర్ణన అందులో ఉన్నదని గమనించారు. అప్పటికప్పుడు కొన్ని పద్యాలు చదివారు. చాలా బాగున్నాయని ఆనందిస్తూ తల పంకిం

వారు. ముందు పేజీల్లోకి వచ్చారు. ఆ ముందు పేజీల్లో పెద్దలు వ్రాసిన ముందు మాటలున్నాయి. విశ్వనాథ, కట్టమంచి ఆ పెద్దలు. ఇద్దరూ అసాధ్యులు. ఒక పట్టాన సమాధానపడనివారు. సామాన్యంగా ఎవరినీ పొగడనివారు. ఈ రచయితని ఇంతగా ప్రశంసిస్తున్నారూ అంటే ఈ రచయిత నిజంగా గొప్పవారయి ఉండాలి అంటూ ఇంకా ముందుకు వచ్చారు. రచన ఎక్కిరాల కృష్ణమాచార్య అని వ్రాసి ఉంది. ఎవరీ కృష్ణమాచార్య? అని ఆయన దీర్ఘంగా ఆలోచిస్తూ ఉండగా మాస్టరు గారు అక్కడకు వచ్చారు.

బల్లను సమీపించిన మాస్టరుగారు ఈ పుస్తకాలు నావే. వీటిని తీసుకువెళ్ళాలి అన్నట్లు చూస్తున్నారు. పుస్తకాలు ఈయనవి కాబట్టి ఈ యువకునికి ఈ కృష్ణమాచార్య ఎవరో తెలిసి ఉంటుంది. అని అనుకున్నారు రామ్మూర్తిగారు. కృష్ణమాచార్య అనే ఆ రచయితకు ఈ యువకుడు అభిమాని అని ఆయన ఉద్దేశ్యం. పుస్తకాన్ని చూపిస్తూ ఎవరండీ ఈ కృష్ణమాచార్య! ఇంత అద్భుతమైన కవిత్వం వ్రాశారు. ఎవరినీ పొగడని వాళ్ళు కూడ ఈయన్ని పొగిడారండి. ఎవరండీ ఈయన? అని అడిగారు రామ్మూర్తిగారు.

చిరునవ్వులు చిందిస్తూ మాస్టరుగారు 'మనమేనండీ' అన్నారు. ఆకెళ్ళవారు దద్దరిల్లారు. ఆయన కళ్ళను ఆయనే నమ్మలేకపోయారు. ఈయనేనా; ఈ యువకుడేనా ఈ విద్యార్థి దశలోనే ఇంతటి కవిత్వం వ్రాశారా ? అనుకుంటూ అలాగే ఉండి పోయారాయన కాసేపు. ఆయన పడుతున్న ఆశ్చర్యమంతా ఆయన కళ్ళనుండి వ్యక్తమవుతోంది. ఆయన ఆ ఆశ్చర్యం నుండి తేరుకునే లోపుననే మాస్టరుగారు ఆయనతో చెప్పి సెలవు తీసుకోవడం మిత్రులతో కలసి ఆ ప్రాంగణం నుండి నిష్క్రమించడం కూడా పూర్తయింది.

ఆశ్చర్యం నుండి క్రమంగా తేరుకున్న ఆకెళ్ళ వారు ఇక ఋతు గాన రచయితను మరచిపోలేక పోయారు. ఆ యువకునితో పరిచయం కోసం స్నేహం కోసం తహతహలాడారు వారి నుంచి తనాన్ని అభి మానాన్ని చూసి మాస్టరు గారు కూడా ఆయనకు దగ్గర కాకుండా ఉండ లేకపోయారు వయస్సులకు అతీతంగా సరస సల్లాపాలతో నిత్యనూత నంగా విజృంభించసాగింది వారి స్నేహం.

ఇంతలో మాస్టరుగారి ఆనర్స్ పూర్తయింది. అందరి విద్యార్థు ల్లాగానే ఆయన కూడా తనకు అత్యంత ప్రీతి పాత్రమయిన ఆత్మీయులను ఎందరినో సమకూర్చి పెట్టిన ఆ విశ్వ విద్యాలయ ప్రాంగణాన్ని విడిచి పెట్టక తప్పలేదు. అందరితో పాటుగా రామ్మూర్తి గారి దగ్గర నుండి కూడా వీడ్కోలు అందుకోవడానికి వెళ్ళారు మాస్టరుగారు.

ఒకరినొకరు విడిచిపెట్టలేరు. అంతటి స్నేహం వారిది. కాని విడిచిపెట్టక తప్పదు కదా. స్నేహానుభూతి బాష్పాలరూపం ధరిస్తూఉండగా రామ్మూర్తిగారు చెప్పారండి. మీరిక్కడే కాదు విశ్వం మొత్తంలో ఒక విశిష్టమైన వ్యక్తిగా గుర్తింప బడవలసిన వారు. మీముందున్నది ఉజ్జ్వల మైన భవిష్యత్తు. మీరెక్కడ ఉంటే అక్కడి వాళ్ళు అదృష్టవంతులు వెళ్ళిరండి. ఈ పెద్దవాణ్ణి మాత్రం మీ హృదయంలో కాస్తంత చోటిచ్చి గుర్తుంచుకోండి అంటూ వీడ్కోలు చెప్పారు.

"నేనిచ్చే దేమిటి? నా హృదయంలో మీకు కావలసిన చోటును మీరే ఆక్రమించుకున్నారు కదా! నేను ఎవరి ఆక్రమణనూ కాదనను. ఆ క్రమంలో అందరినీ తప్పక గుర్తుంచుకుంటాను. కాదు నాకు అందరూ అలా గుర్తుండి పోతారు" అంటూ సెలవు తీసుకున్నారు మాస్టరుగారు.

కాలచక్రం గిర్రున తిరుగుతోంది. సంవత్సరాలు దొర్లుతున్నాయి. రామ్మూర్తిగారికి మరింత వయస్సు వచ్చింది. విద్యార్థుల బ్యాచీలు ఎన్నో వస్తున్నాయి, ఎన్నో వెడుతున్నాయి. కాని" విద్యార్థి అంటే ఆయన ఆ కృష్ణమాచార్య. విద్వత్తు అంటే ఆయనది. ఆయన నిజంగా కారణజన్ముడే" అని గుర్తుకొచ్చినపుడల్లా అనుకుంటూ ఉండేవారాయన అవకాశం వచ్చినపుడల్లా మిత్రులకు చెపుతూ ఉండేవారు.

ఇంతలో ఒక వార్త పదేపదే ఆ పెళ్ళవారి చెవులకు వినబడ సాగింది. ఎవరో కొత్తగా యూనివర్శిటీ తెలుగు డిపార్టుమెంటులో రీసెర్చికని చేరారుట. ఆయన చాలా పెద్ద హోమియో వైద్యుడట గూడ. ఎక్కడా మాట వినని మొండివ్యాధులు సైతం ఆయన చేయి సోకితే ఇట్టే తలలు వంచి తప్పుకుంటున్నాయట. ఇలా అనేక విధాలుగా ఆ వార్త ఆయన చెవిని మరల మరల పడుతూనే ఉన్నది. పడుతున్న ప్రతి సారీ ఆయనెవరో ? ఆయనను ఒకసారి మనం చూస్తే బాగుంటుంది అనిపించసాగింది. సరే చూద్దాం. ఎప్పుడో ఒకప్పుడు అవకాశం దాని కదిగా రాకపోతుందా! ఆయన మన కళ్ళబడకపోతాడా! అనుకుంటూ కాలాన్ని ముందుకు సాగనిచ్చారు ఆ పెళ్ళవారు.

ఒకరోజున సిరిపురానికి దారితీసే యూనివర్శిటీ రోడ్డుపైన కాలి నడకన సాగుతున్న ఆ పెళ్ళ వారి కళ్ళకు ఎదురుగా నడచి వస్తున్న ఒక ప్రత్యేకమైన బృందం గోచరించింది. ఆ బృందంలో నలుగురైదుగురు యూనివర్శిటీకి సంబంధించిన ప్రొఫెసర్లూ రీడర్లూ వినయవిధేయతలతో నడుస్తూ తమ మధ్యన ఉండి తమతో సాగుతున్న ఒకానొక వ్యక్తి వైపు మిక్కిలి భక్తి విశ్వాసాలను వ్యక్తం చేస్తున్నారు.

ఆ నడుమనున్న వ్యక్తి తెల్లటి లాక్కా, తెల్లటి లుంగీ పంచతో

చెప్పలేని వెలుగులను వెదజల్లుతూ చిన్న చిన్న అడుగులను చకచకా వేస్తున్నారు.

ఈయన.... మన.... కృష్ణమాచార్య కదూ అని ఆకెళ్ళవారు అనుకొని అపునపునని మనస్సుతో నిర్ణయించుకొనే లోపున ఏం స్వామీ! బాగున్నారా! అంటూ ఆయనే ఆప్యాయంగా చేతులు చాపారు.

ఆకెళ్ళవారి ఆనందానికి ఇక అవధులు లేవు. అదే గొంతు, అదే పిలుపు, అదే ఆత్మీయత రూపం మాత్రం కొంచెం మారింది అప్పటి కన్నా ఇంకానిండుగా ఇంకా జబర్దస్తీగా ఉన్నారీయన అనుకుంటూ యోగక్షేమాలనుగూర్చి కుశల ప్రశ్నలు వేశారు.

మాష్టరుగారు రిటైర్మెంట్ తరలి వచ్చినట్లు విని మరికొంతకాలం కలసి మనేటందుకు అవకాశం లభించింది కదా! అని ఆనందపడ్డారు. ఇంతలో ఆయనకు తన చెవిన పడుతూ వచ్చిన వార్తగుర్తుకు వచ్చింది.

అవునూ! ఎవరండీ ఆయన! మీ డిపార్టుమెంటులో మీలాగే కొత్తగా రిసెర్చిలో చేరాటట. ఆయన హోమియో వైద్యం కూడా అద్భుతంగా చేస్తాటట అబ్బో ఎన్ని కథలు? ఎన్ని కబుర్లు ఆయనను గురించి ఈ చెవిన పడుతున్నాయో! ఇంతకూ ఎవరండీ ఆయన అంటూ మాష్టరుగారి వైపు ప్రశ్నార్థకంగా చూశారు ఆకెళ్లవారు.

చిరునవ్వులు చిందిస్తూ మాష్టరుగారు 'మనమేనండీ' అన్నారు. ఆకెళ్లవారికి ఒళ్ళు జలదరించింది మనస్సొక్కడికో గత కాలపు లోతులకు ఒక్కసారిగా వెళ్లిపోయింది. 'మనమేనండీ' అంటూ చిరునవ్వులు చిందిస్తూ నిలబడిన ఋతుగాన రచయిత అయిన ఆ యువకుడు ఆయన

మనో నేత్రానికి కనిపించాడు. ఓహో! ఏమి సమాధానం! అదే సమాధానం! అదే హుందాతనం అది యొక దివ్యమైన ఆత్మవిశ్వాసం.

పులకించిపోతూ ఆకెళ్లవారు తన కళ్లను తానే నమ్మలేక మాస్టరు గారి రెండు చేతులను తీసికొని భక్తిగా రూపు చెందుతున్న ప్రేమతో ఒకసారి తన కళ్లకు గట్టిగా హత్తుకున్నారు.

రామ్మూర్తిగారు మాస్టరుగారికి ఇంత దగ్గర వారా! మనకు తెలియదే! అన్నట్లు ఆశ్చర్యంగా చూస్తున్నారు మిత్రబృందం.

ఈయన అసాధ్యులు. ఈయన కారణజన్ములు. లోకశ్రేయస్సుకు కావల్సిన దేవినైనా ఈయన తన నుండి వ్యక్తం చేయగలరు. మానవుడికి కావల్సిన దానిని అది యేదైనా సరే! దివినుండి భువికి అవతరింపజేయగలరు అంటూ, అనుకొంటూ పరవశించిపోతున్నది రామ్మూర్తి గారి మనస్సు.

—o—

# ఇష్టపడిన క్షణాల్లోనే

ఒక రోజు రాత్రి రాధా మాధవంలో రచనా వ్యాసంగం పూర్తయిన తరువాత పడుకోబోయేముందు సల్లాపాల లోనికి దిగాం! ఉన్నది నేనూ! ఆయనా! ఇద్దరమే.

సల్లాపాల మధ్య మన ముందుతరం కవుల యిజా ప్రవర్తనను గూర్చిన ప్రస్తావన వచ్చింది. గతంలోనికి చూస్తున్న అనుభూతి ప్రదమైన చూపుతో ఆయనిలా చెప్పారు : కాటూరి వెంకటేశ్వరరావుగారు తెలుసు గదా?

తెలుసును. సౌందరనందం చదివాను చాలా బాగుంటుంది. అప్పటినుండి ఆ కావ్య రచయితలుగా పింగళి, కాటూరులకు నా హృదయంలో ఒక చోటు ఏర్పడిపోయింది అన్నాను.

మరింకేమి! ఆ కాటూరివి గూర్చి చెప్పుకుందాం! విను మరి! ఆయన చాలా సహృదయుడు. విశిష్టమైన వ్యక్తిత్వం ఆయనది. ఆయన ఎంత గొప్ప కవో అంత గొప్ప ధర్మ విష్ఠుడుకూడా!

అందుకే వారినుండి సౌందరనందం వలికింది అన్నాను. నిజం

గానే. ఆయన వ్యక్తిత్వం ఆ గ్రంథం చిగిరూపదాని కెంతో ఉపక
రించింది. ఒక చిన్న సన్నివేశం చెబుతాను విను

చెప్పండి !

ఒక రోజు కాటూరివారు పొలాన తువ్వలను నూర్పించి వడ్ల బం
డ్లతో ఇంటి ముఖం పట్టారు. సాయం సమయమది. సంధ్యారాగ సౌంద
ర్యాలను అవలోకిస్తూ సాగుతున్నారాయన.

ఇంతలో కాటూరివారి కళ్ళకు ఒక బీద బ్రాహ్మణుడు కనిపిం
చాడు. ఆయన తనను గురించే అటు వస్తున్నట్టు గమనించిన కాటూరి
వారు ఆ బ్రాహ్మణుని పలకరించి యోగక్షేమాలను గూర్చిన విచారణ
చేశారు.

ఆ బీద బ్రాహ్మణుడు మాటల మధ్యలో తాను ఆడపిల్ల పెళ్ళికి
సంకల్పించాననీ, ముహూర్తం నిర్ణయమైందని చెప్పాడు.

వెంటనే కాటూరివారు తమ వెనుకవస్తున్న బండి వానితో "నీవు
ఈ బండి వడ్లను వీరి యింటి దగ్గర దింపిరా ! దింపివచ్చి ఇంటిదగ్గర
నాకు కనబడు" అని ఆజ్ఞాపించాడు.

ఆ బీద బ్రాహ్మణుని వెంట ఆ వడ్లబండి నడచి వెళ్ళింది.
కాటూరివారు మిగిలిన బండ్లతో మామూలుగా ముందుకు సాగుతున్నారు.

ఆయనతో అడుగులు వేస్తున్న సన్నిహితు డొకరు "మీరు అడి
గినదే తడవుగా వడ్ల బండి దారిని మళ్ళించి వేశారు. తర్వాత నిదా
నంగా చూడవచ్చునుగదా !" అన్నారు.

కాటూరివారు చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు. ఇప్పుడు పుట్టినబుద్ధి ఇంతా కాసేపటికి ఇలాగే నిలుస్తుందని నమ్మకమేమిటి చెప్పండి. ఇప్పుడు వినగానే బండీ ఇద్దామని అనిపించింది కాస్తా గితే బస్తా ఇస్తే చాలదేమిటి అనిపించవచ్చు. మంచిపని చేయా లనిపించినపుడు వెంటనే చేసేయడమే మంచిది. మనస్సు చిత్రమైనది. అది ఇష్టపడిన క్షణాల్లోనే మనం మంచి పనిని చేసేయాలి.

ఆ వివరణకు ఆ మిత్రుని మనస్సు వికసించింది. ఆ మిత్రునికే కాదు ఈ కథను ఎప్పుడు చెప్పుకున్నా ఆ చెప్పుకుంటున్న క్షణాల్లో మన మనస్సులకు కూడా ఆ వికాసం లభిస్తూనే ఉంటుంది. వాళ్ళు న్మానాలను ఆశించిన కవులు కారు. సన్మార్గాన్ని నిర్దేశించిన కవులు. న్నారు మాస్టరుగారు.

అనుభూతి ప్రదమైన మౌనం రాజ్యమేలింది మా మధ్య కొంత పు. అంతలోనే ఎప్పుడు స్వీకరించిందో ఏమో నిద్రాదేవి తన ఒడి నికి మమ్మల్ని స్వీకరించింది.

  

## పెద్దవాళ్ళ పోకడలు

ఈరోజు ఎవరిని గురించి చెబుతారు ? పెద్దలగురించి ఎంత చెప్పుకున్నా ఇంకా చెప్పుకోవాలనే అనిపిస్తుంది. వాళ్ళ సరసంకూడా సందేశాత్మకంగానే ఉంటుంది అన్నాను. ఆపూటకు రచనా వ్యాసంగానికి సంబంధించిన కాగితాలను సర్దేస్తూ.

మాస్టరుగారిలా అన్నారు : తల్లావఝుల శివశంకర శాస్త్రిగారు తెలుసుగదా ! ఆయన అవతలివారు ఏమనుకుంటారు అని అనుకోకుండా చెప్పదలచిన మాటను సూటిగా సరసంగా చెప్పేవారు.

ఆ రోజుల్లో రచనా పాటవం గలిగిన ఒక బ్రహ్మద్వేషి ఉండేవాడు. అతడు చాలా శ్రమపడి ఒక ఉత్కృష్టమైన గ్రంథాన్ని రచించాడు. దానిపేరు 'అష్టాదశ మహా పాపి యగు బ్రాహ్మణుడు' ఆ గ్రంథాన్నిమరింత శ్రమపడి అచ్చువేయించాడు. అచ్చయిన ఆగ్రంథాన్ని మళ్ళీ మళ్ళీ చూసుకొని, చదువుకొని మురిసిపోతూ ఉండేవాడతడు దేశంలోని పెద్దలందరికీ తన గ్రంథం అందాలనీ, వాళ్ళందరూ తః భావ పరంపరను ఆమూలాగ్రంగా చదివి తరించాలనీ తాపత్రయ ప పోయేవాడతడు. ఆ పెద్దల అడ్రస్సులు సంపాదించి పోస్టుద్వారా వాళ్ళ గ్రంథరూపంలో వెంబడిస్తూ ఉండేవాడు. ఇక పెద్దవారెవరైనా తః

ఊరికే వచ్చారని తెలిపించనుకో అతని ఆనందోత్సాహాలకు అవధు లుండేవికావు. వెంటనే వాళ్ళను పట్టుకొని తన గ్రంథాన్ని వాళ్ళకు బహూకరించి, ఆ గ్రంథాన్ని చూస్తున్నప్పుడు ఆ పెద్దల ముఖ కవళి కలు ఎలా మారుతున్నాయో స్వయంగా గమనిస్తూ తృప్తిని చెందుతూ ఉండేవాడు. మానవులు ఆనందాన్ని ఎన్నోవిధాల పొందాలని చూస్తారు గదా! ఆ రచయిత ఈ మార్గాన్ని ఎంచుకొన్నాడన్నమాట.

ఒకసారి శివశంకరశాస్త్రిగారు ఊళ్ళోకి వచ్చారని తెలిసిందతనికి. ఆపుస్తకం ప్రతినొకదానిని తీసుకొని దానిపైన "ప్రజెంటెడ్ విత్ బెస్ట్ కాంప్లిమెంట్స్" అని వ్రాసి సంతకం పెట్టి తన కొడుకుద్వారా శాస్త్రి గారికి పంపించాడు. శాస్త్రిగారు ఒక్కసారి ఆ గ్రంథాన్ని తేరిపారజూచి ఆయనవ్రాసి సంతకం పెట్టిన దానిక్రింద 'రిజెక్టెడ్ విత్ కంటెంప్ట్' అని వ్రాసి సంతకం పెట్టి ఈ పుస్తకాన్ని తిరిగి మీ నాన్న కివ్వు అని త్రిప్పి పంపించారు. ఆ రచయితకు ఒళ్ళు మండిపోయింది. కాని ఏం చేయగలడు? అవకాశం ఎలా వస్తుందా అని చూస్తున్నాడు శాస్త్రి గారిపై దంటెత్తడానికి.

ఆ రోజు సాయంత్రమే ఆ ఊళ్ళో పెద్ద సాహిత్య సభ జరిగింది. ప్రజలు తండోపతండాలుగా పాల్గొన్న ఆ సభలో శాస్త్రిగారితో పాటు ఆ రచయిత కూడా పాల్గొన్నాడు. మాట్లాడడంలో ఆ రచయిత వంతు వచ్చింది. ఇక అంతే. మైకు పట్టుకుని శాస్త్రిగారిపై విరుచుకు పడ్డాడు. ఈ పెద్దాయనకు అభినందనలతో బహూకరిస్తున్నానని నేను నాగ్రంథాన్ని పంపితే దానిపైనే అసహ్యించుకుంటూ త్రిప్పి కొడుతున్నానని వ్రాసి సంతకం పెట్టి మరీ పంపారీయన. ఇదేమైన మర్యాదగా ఉందా? ఇదేమని వారి గ్రంథాల ఎడల నేనాచరిస్తే ఆయనేమవుతారు? ప్రజలారా మీరే ఆలోచించండి అంటూ వాపోయాడు.

ఆ తరువాత శ్రీ శివశంకర శాస్త్రిగారి వంతు వచ్చింది. ఆయనిలా చెప్పారు: వీరు నాకొక గ్రంథాన్ని పంపారు. పుస్తకం పైన బహుమానం అని వ్రాసినా వారు మనస్సులో సంకల్పించినది అవమానమే. వారు పంపిన దృష్టిబట్టి, ఆ గ్రంథంలో వారు ప్రదర్శించిన రాగద్వేషాల తీవ్రతను బట్టి నేను వెంటనే అసహ్యించుకుంటూ త్రిప్పి పంపాను. అసహ్యం అంటే తప్పర్థం ఏమీ లేదు. సహించలేక పోవడం అని అర్థం. వారు చేసిన పనిని నేను సహించలేకపోయాను. అది సూటిగా వారికే వ్రాసి పంపాను. ఇందులో తప్పేమిటో నాకు బోధ పడడంలేదు.

ఆ రచయిత ముఖంలో జంకు కనిపించింది.

ఆ రచయిత పైపు తిరిగి శాస్త్రి గారు ఇలా అన్నారు: మీరు మీకు తోచిందల్లా వ్రాసి ప్రజలకు పంచిపెట్టి చదివేదాకా బలాత్కరిస్తున్నారు. ఆ గ్రంథం పైన నాకు తోచినదేదో ఒక్క వాక్యం వ్రాసి నేను మీకు మాత్రమే పంపాను. మీరే సభలో ఆ ప్రస్తావన తెచ్చి ఆ వాక్యాన్ని అందరకూ పరిచయంచేశారు. సరే అది మీ యిష్టం.

మీ రొక మాటన్నారు. అదేపని మీరు నాయెడల చేస్తే నేనే మవుతానని. దానికి నాసమాధానం వినండి. నేనుగా నా పుస్తకమేదీ మీకు బహూకరించను. ఒకవేళ పట్టుదలతో నా పుస్తకాలను కొని మీరనుకున్న పని చేశారనుకోండి. ఆ వచ్చిన డబ్బులతో వెంటనే ఆ గ్రంథాలను తరువాతి ముద్రణ వేయించి ప్రజలముందు పెడతాను. కను! మీరు ఏ విధంగా ప్రవర్తించినా నాకు సంతోషమే.

ఆ రచయిత ఒక విధమైన సిగ్గుతో తలవంచుకున్నాడు.

శాస్త్రిగారింకా ఇలా అన్నారు : చూడు నాయినా నీవు బ్రాహ్మణులను తిడుతూ గ్రంథం వ్రాశావు. కసితీరా దానికి 'అష్టాదశ మహా పాపియగు బ్రాహ్మణుడు' అని పేరు పెట్టావు. మంచి చెడులు, ధర్మాధర్మాలు, అనేవి ఏకులంలోగాని, ఏ వర్గంలోగాని కలగలుపుగా ఉంటాయని మనం మర్చిపోకూడదు. పూర్తిగా ఒక కులం మంచిదనిగాని, చెడ్డదనిగాని చెప్పడానికి సిద్ధపడడం అవివేకం అవుతుంది తప్ప మరొకటి కాదు. సూటిగా చూస్తే ఒక మనిషిలోనే మంచీ, చెడూ రెండూ కనపడుతూ ఉంటాయి. అలాంటివి ఒకకులం మొత్తాన్నో ఒక వర్గం మొత్తాన్నో ఇది చెడ్డది, పాపిష్టిది అని తీసి వేయవచ్చునా ? అధర్మాన్ని ఎక్కడున్నా దాన్ని మనం హద్దుల్లో పెట్టవలసిందే. కాని ధర్మాన్ని స్వీకరించడానికి మనకు కులాలు, మతాలు, వర్గాలు అడ్డు రాకూడదు. కన్నులను కొంచెం పెద్దని చేసుకో. మనస్సును కొంచెం విశాలం చేసుకోవడానికి ప్రయత్నించు. హృదయాన్ని కొంచెం కదలి కరుగనీ. అప్పుడు సమాజాన్ని చూడగలిగిన వివేకం నీలో పెరుగుతుంది. పెద్దవాణ్ణి తిట్టానని బాధపడకు. దాన్ని మందలించడంగా స్వీకరించు. ఆ మందలించడానికి వెనుకనున్న నాహృదయాన్నీ, ఆ హృదయాన్ని నడుపుతున్న ధర్మ స్వరూపాన్ని గమనించు. పెద్దవాళ్ళు ఏది చేసినా ప్రేమతోనే చేస్తారు వాళ్ళను ద్వేషించడం చేతకాదు.

ఆ రచయిత ఇంకా తలవంచుకున్నాడు. బహుశ ఆత్మ పరిశీలనలో నిమగ్నమై ఉంటాడు. అదే జరిగితే అంతకన్న కావలసింది ఏముంటుంది ?

ఏం కృష్ణస్వామీ ఈ సన్నివేశం ఎలావుంది ? ఆ రోజుల్లో ఆ పెద్దవాళ్ళు ఎంత సూటిగా ఎంత ప్రేమగా మరెంత బాధ్యతగా ప్రవ

ర్తించే వారో చూశావా! ఇప్పటి మన తరంలోని రచయితలు ఆ పెద్దల పోకడల వైపు కన్నెత్తి ఒకసారి చూడవలసి ఉంది. ఏమంటావు?]

చాలా బాగుంది మాస్టారూ. మీరు చెప్పిన పుట్టం నన్నెక్కడికో తీసుకు వెళ్ళిపోయింది అన్నాను.

నిజమే. ఆపట్టానికున్న శక్తి అటువంటిది. నీకు చెప్పడం ప్రారంభించి నప్పటినుండి నాకళ్ళముందు అపట్టం జరిగినది జరిగి నట్టుగా సాక్షాత్కరించ సాగింది. అందుకే నీకింత వివరంగా చెప్పగలి గాను. పెద్దల జీవిత సన్నివేశాలూ, సంభాషణలూ ఎక్కడికీ పోవు. సూక్ష్మలోకాల్లో అవి భద్రపరచబడి ఉంటాయి. దైవానుగ్రహం చేత చూడగలిగిన వారికి చూడవలసిన సమయంలో అవి కనులకు కడతాయి. చెవులకు వినబడతాయి.

ఆశ్చర్యానందాలను అనుభవిస్తూ అలా ఉండిపోయాను కొంత సేపు. అలా ఆ అనుభూతిలో ఉండగానే ఎప్పుడో నిద్రాదేవి మాకు తెలియకుండానే మమ్మల్ని తన ఒడిలోనికి స్వీకరించడం జరిగి ఉంటుంది.

  

## ఎదురు తూపులు

ఎం.ఏ., ఫైనల్ ఇయర్ చదువుతున్నప్పుడు అవకాశం దొరికినపుడల్లా రాత్రి తొమ్మిది గంటల ప్రాంతానికి మాస్టరుగారింటికి చేరేవాడిని. మాస్టరుగారితో అవకాశమున్నంత సేపు మాట్లాడుకొని తనివి తీరని ఆ సంభాషణలో నుండి ఏదో ఒక వేళకు మళ్ళీ హాస్టల్‌కు చేరుతూ ఉండే వాడిని. ఈ ప్రత్యేక కార్యక్రమంలో అప్పుడప్పుడూ ఆత్మీయులైన మరి కొంతమంది సహాధ్యాయులు కూడా పాల్గొని పరవశిస్తూ ఉండేవారు.

మాస్టరుగారితో మాట్లాడుతున్నంత సేపు ఎంత సరదాగా హాయిగా ఉండేదో. ఆ సరదా! ఆ హాయి! మళ్ళీ మళ్ళీ అక్కడకు మమ్మల్ని లాక్కుపోతూ ఉండేవి. ఆయన మామూలుగా మాట్లాడినా ఆ మాటలు మామూలుగా ఉండేవి కావు. ఎంతో మధురంగా ఉండేవి. కర్తవ్య నిర్వహణలో ఉండేటప్పుడు ఆయన అక్కడున్న సందర్భానికి తగినట్లు ప్రవర్తించేవారు. అక్కడ ప్రేమ అవసరమైతే ప్రేమ, కోపం అవసరమైతే కోపం, ఔదార్యం అవసరమైతే ఔదార్యం ఇలా నవరసాలు ఆయన నుండి వ్యక్తమవుతూ ఉండేవి. నవరసాలకు గమ్యం ఆనందమైనట్లు ఆయన నుండి ఏరూపం వ్యక్తమైనా, అది అవతలి వ్యక్తిని ఆనందపథాన నడిపించడానికే. కర్తవ్య నిర్వహణ నుండి ఇవతలకు వచ్చినపుడు సన్నిహితులతో చాలా సరదాగా, చమత్కారంగా వాళ్ళలో

తానూ ఒకరై పోయి మాట్లాడే వారాయన. ఇలా మాట్లాడడం ఆ సన్ని హితులను సంతోషపరచి వాళ్ల వాళ్ల కర్తవ్య నిర్వహణలకు తగిన స్ఫూర్తినిచ్చేది. ఇలా ఆయన తన విరామాన్ని కూడా చక్కగా సద్వినియోగం చేసేవారు. ఆయన అలాంటి సద్వినియోగాన్ని చేయడానికే అలా అప్పుడప్పుడూ విరామాన్ని స్వీకరిస్తూ ఉండేవారేమో అనిపిస్తుంది. ఎందువల్లనంటే అలా విరామ సమయాలలో ఆయన కరస్పర్శలచేత స్పృశింపబడి పులకించినవారే ఈనాడు ఆయనకు వారసులై నేల నాలుగు చెరగులా వెలుగులు విరజిమ్ముతున్నారు.

మాస్టరు గారితో మాట్లాడుతున్నప్పుడు మరో చిత్రం కూడా కనిపించేది. ఆయనతో మాట్లాడుతున్నంతసేపూ ఆయన మాస్టరుగారని అనిపించేది కాదు. ఒక ఆత్మీయుడైన మంచి స్నేహితునితో మనస్సువిప్పి యథేచ్ఛగా మాట్లాడుతున్నట్లు అనిపించేది. సన్నివేశం పూర్తయి ఇవతలకు వచ్చాక అమ్మో మాస్టరుగారు! ఆయన తోనే మనం ఇవన్నీ ఇంతయిదిగా మాట్లాడింది అనిపించేది. మళ్లీ చేరువైనపుడు మళ్లీ మామూలే! యథాపూర్వకంగా సరదా సరదాగా మాట్లాడేసే వాళ్లం. ఇది ఒక చిత్రం. ఇది ఒక వైష్ణవమాయ.

మరొక గమ్మత్తు ఏమిటంటే మాస్టరుగారితో మాట్లాడుతున్నప్పుడు వారు వయస్సులో చాలా పెద్దవారు అన్న స్పృహ కలిగేది కాదు. సమవయస్కునితో మాట్లాడుతున్న అనుభూతి కలిగేది. కారణం ఆయన అలా సన్నివేశానికి తగ్గటుగా ఒదిగిపోవాలి అంటే ఒదిగిపోయేవారు. ఎదిగిపోవాలి అంటే ఎదిగిపోయేవారు. ఆంజనేయుడు కావల్సినంత శరీరంతో వ్యక్తమయ్యేవాడని చెబుతారు. సన్నివేశానికి కావల్సిన వయస్సులో, పద్ధతిలో వ్యక్తమౌతూ ఉండేవారు. పిల్లలలో పిల్లవానిగా యువకులలో యువకునిగా, పెద్దలలో పెద్దగా, జ్ఞానులలో జ్ఞానిగా

అవతారమూర్తులలో అవతారమూర్తిగా ఆయన గోచరించేవారు ఇంకా చెప్పాలి అంటే కృష్ణావతారాన్ని కళ్ల ముందు చూస్తున్నట్లు ఉండేది.

నేను వెళ్లేటప్పటికి రాత్రి 9-30 అవుతోంది. మాస్టరుగారు భోజనం పూర్తిచేసి వంటింటి గుమ్మం దగ్గర నిల్చుని దేనినో శ్రద్ధగా గమనిస్తున్నారు. నేను వెళ్లి ఆయనకు ప్రక్కగా నిలబడ్డాను.

నన్ను గమనించినట్లుగా ఒక చిరునవ్వునవ్వి "కృష్ణస్వామీ ఒకసారి అటు చూడు" అన్నారు.

'చూశాను' అన్నాను.

'ఏమిటి చూశావు' అన్నారు.

'అక్కయ్యగారు వంటిల్లు కడుగుతున్నారు' అన్నాను.

'కడుగుటూ ఉంటే ఏమవుతోంది' అన్నారు.

'నీళ్లు పైకుర తిరిగి వస్తున్నాయి' అన్నాను.

'అదే నిన్ను చూడమన్నది' అంటూ చిన్నగా నవ్వారు.

ఏమిటి? అలా జరుగుతున్నది? అన్నాను.

అదే మరి! ఈ చిత్రం ఇక్కడే కాదు విశాఖ పట్టణంలో నూటికి తొంభై ఇళ్లల్లో జరిగే తంతు ఇదే. ఇలా నీటిని తిప్పికొడుతున్న ఈ భూములను ఏమంటారో తెలుసునా?

'ఏమంటారు' అన్నాను.

'ఎదురు భూములుఅంటారు' అన్నారు.

'ఈ నామకరణం మీరు చేసి ఉంటారు'

ఎవరుచేస్తేనేం ఔచిత్యవంతంగా ఉన్నదా? లేదా?

'మీరు పెట్టిన పేరుకు తిరుగేముంటుంది. అయినా ఇది పేరుకు విశాఖపట్టణం గానీ జీవించడానికి వస్తే ఇది విసుగుపట్టణమే' అన్నాను.

ఆయన నవ్వారు. నవ్వి, నా పేరుకు తిరుగు లేదంటూనే తిరుగు లేని ప్రాస ఒకటి వేసావే! అన్నారు.

'ఆ....ఆ....మీరు పెట్టిన పేర్లకూ తిరుగులేదు. అతను వేసే ప్రాసలకూ తిరుగులేదు. ఎన్ని ఇళ్లు మారినా ఈ బాధలూ తప్పేదిలేదు' అంటూ ఎలాగో అలా పనిని పూర్తి చేసిన అక్కయ్యగారు వంటింటి నుండి బయటకు వచ్చే ప్రయత్నం చేస్తున్నారు. ఎంత పని ఉన్నా తాను చేస్తూ తగిన వారితో చేయిస్తూ ఉండడమే తప్ప విసుగుదల చూపే వారు కాదు అక్కయ్యగారు. వంటింటిని ఎప్పుడూ ఎంతో శుచిగా, అందంగా ఉంచేవారు. ఒకలా చెప్పాలి అంటే అది మేమందరం సిద్ధం చేసుకునే పూజగది కన్నా కూడా చాలా బాగుండేది. చూడముచ్చటగా ఉండేది. విశాఖపట్నంలో అద్దెయింటిని అలా ఉంచగలగడం అక్కయ్య గారికే సాధ్యమయింది అనిపిస్తుంది.

వంటగది నుండి ఇవతల గదిలోనికి దారితీస్తూ 'మాస్టారూ! నామకరణమైతే చెప్పారు గాని ఆ నామకరణంలోని ఔచిత్యాన్ని గురించి మీరు తగుమాత్రం వివరించాల్సి ఉంది' అన్నాను.

'ఇంకా బకాయి ఉందంటావ్! అయితే చెబుతాను విను. ఈ కూడలు ఇటు నుండి మనం తోస్తున్న నీటిని అటునుండి మళ్లీ మన

కెదురు పంపించేస్తూ ఉంటాయి. అసలు నీళ్లు బయటకు పోకుండా చూడడానికే ఈ తూములున్నాయనిపిస్తుంది. ఇంకా చెప్పాలి అంటే ఈ తూములవల్లనే బయటినీళ్లే లోపలికి వస్తాయి'

అదేమిటి? అన్నట్లు చూశాను నేను.

ఆయన ఇలా వివరణ కొనసాగించారు. 'ఇందులో ఆశ్చర్యమేముంది? వర్షాలు అవీ కురిసినపుడు అకస్మాత్తుగా ఊడిపడ్డ ఆ నీళ్ళకు తామెటు పోవాలో తెలియదు. ఇలా ఈ తూములు సహకారంతో ఇళ్ల లోపలికి వచ్చేస్తూ ఉంటాయి. మనకు సహకరించకపోయినా ఆ వర్షపు నీటికి మాత్రం హార్దిక స్నేహితుల్లా సహకరిస్తాయవి. అందుకు అన్నీ ఆలోచించిన మీదట వీటికి ఎదురుతూములని నామకరణం చేశాను'.

ఇప్పుడు బాగా అర్థమయింది మాస్టారు! చాలా బాగుంది మీ నామకరణం అన్నాను.

బాగుంది నాయనా! మీ గురు శిష్యుల సంవాదం. చాలా బాగుంది కానీ! మీ గురుశిష్యులిద్దరూ ఇప్పుడీ యిళ్ళను చేయగలిగింది ఏమీ లేదు గాని ఏదైనా వదిలి వచ్చే పని ఉంటే చూసుకోండి. కాలం సద్వినియోగమవుతుంది అన్నారు అక్కయ్యగారు ఆ ప్రక్కనే తమ పక్కను సర్దుకుంటూ!

అదేమిటి! అలా అంటావ్! కాదేదీ కవితకనర్హం అన్నట్లు కాదేదీ కబుర్లకనర్హం. ఏమంటావ్ కృష్ణస్వామీ! అన్నారు మాస్టరుగారు.

"బాగుంది. ఇదంతా రేపెప్పుడో ఏదో ఒక ఉపన్యాసంలో చెప్పేయగలరు. మీతో మరీ ప్రమాదం" అన్నారు అక్కయ్యగారు ఇక సరిపెట్టండి అన్నట్లు చూస్తూ.

‘అదేమిటండీ అలా అంటారు. ఇలాంటి అంశాలు ఒకటికి రెండుసార్లు ఉపన్యాసాల్లో చెప్పడమే మంచిది. చెప్పగా చెప్పగా కనీసం కొందరైనా సర్దుకొంటారు. ఇళ్లు కట్టుకోబోయే వారైనా సర్దుకొంటారు’ అన్నాను నేను.

నువ్వూ మరీను. నిన్ను చూసి ఆయన ఇంకాను. బాగుంది మీ వరస. మీ కెవరూ చెప్పలేరు బాబూ అంటూ అక్కయ్యగారు చిరు నవ్వు నవ్వుతూనే తమ గదిలో లైటు తీసివేశారు.

‘అక్కయ్యగారు మీరు ప్రాక్టికలండీ. చక్కగా పని పూర్తి చేసుకొని వెంటనే పడుకొంటున్నారు” అన్నాను.

‘ఆ మేలుకోవడాలు, ఆ ప్రాసుకోపడాలు మీకే చెల్లాయి, నన్నిలా వదిలేయండి. తెల్లవారితే బోలెడు పనుంది. అంటూ పడుకొనే ప్రయత్నం చేస్తున్నారామె.

‘మాకు మటుకూ లేదేమిటండీ పని. తెల్లవారితే ఎంత జనం! ఎంత కథ!’ అంటూ కలుగజేసుకొన్నారు మాస్టరుగారు.

“మీతో మమ్మల్ని కలపకండి. మీ పక్క వేరు. సి. వి. వి.గారు మీకా శక్తి నిచ్చారు. ఆ బండి అలా నడిచిపోతోంది. అంతే’ అన్నారు అక్కయ్యగారు.

“బాగా చెప్పారు” అంటూ మాస్టరుగారు అక్కయ్యగారికి అప్పటికి విశ్రాంతినిచ్చి మరొక ప్రస్తావన లోనికి వచ్చారు.

  

# ఏం చేద్దాం మరి ! ఇది...

ఎండాకాలం అది. ఎండలు బాగా ముదిరినట్టే లెక్క. ఒకప్పుడు విశాఖ ఎండాకాలంలో చాల చల్లగా ఉండేదిట. ఈమధ్య నుండి అలా ఉండడం మానేసిందని చాలా కాలం నుండీ ఆ పట్టణంలో ఉంటూ వస్తున్నవాళ్లు అవకాశం దొరికినప్పుడల్లా వాపోతున్నారు. ఒకప్పుడీ విశాఖను 'ఆంధ్రా ఊటీ' అనుకొనేవారుట. క్రమంగా ఇది 'ఆంధ్రా లూటీ'గా మారుతోందని చెప్పాను నేను. అనుభవంలో ఈ మాట రుజువవుతోందని ఆ తర్వాత చాలామంది చెప్పసాగారు.

యూనివర్సిటీనుండి అప్పుడే బయటపడ్డాం. ఎండ బాగా మాడ్చి పారేస్తోంది. తానుగా తగ్గవలసిందేగాని ఎండను తగ్గించగలవారెవరు ?

సిరిపురం జంక్షన్‌లో నిలబడి ఆటో ఏదైనా వస్తుందేమోనని చూస్తున్నాం. ఎక్కడా వస్తున్న జాడ కనబడడం లేదు. బహుశా అవి కూడా ఎండకు దడిసి ఉంటాయి. ప్రకృతి తలుచుకుంటే దడిపించ లేని దెవరిని ?

నాకు దాహం అవుతోంది. ఆ మాట మాస్టరుగారికి సూచించాను. ఆ సూచనను అందుకొని 'నాకూ అవుతున్నట్లే ఉందోయ్!' అన్నారాయన.

'ఏమిటి మాస్టారూ ! మీరూ వియోగంగా మాట్లాడుతున్నారు' అన్నాను.

'నీ సహవాసం అబ్బిందిగా మరి. దాని ప్రభావం ఎక్కడికి పోతుంది అన్నారాయన నవ్వుతూ.

కొంచెం ఆగి ఇంకా ఇలా అన్నారు. 'ఎంతయినా అది అబ్బడం కష్టం. ఏదయినా పుట్టుకతో రావల్సిందే. ఏమంటావు ?'

'ఏమంటాను.ముందు దాహం సంగతి చూడమంటాను' అన్నాను.

"దీన్నే నియోగమంటారు. అడిగినదానికి చెప్పడం మానేసి నీకు కావల్సిన దానికి డైవ్రిప్ చేస్తున్నావ్ !" అన్నారాయన.

'అదేదో మీకూ కావల్సిందేగదా ! అందుకనే గుర్తు చేశాను' అన్నాను.

'నీకు దొరికిపోయాను. బాగుంది. అది సరేగాని ఇద్దరంకలిసి సిరిపురానికి దొరికిపోయాం చూడు మరి.'

ఏమిటా దొరికిపోవడం అన్నాను ఆశ్చర్యపడుతూ !

'అలా ఆశ్చర్యపడతావేమిటి? చుట్టూ కలయజూస్తే తెలియడంలా ఇక్కడేం దొరికేందుకు అవకాశం లేదని' అన్నారు.

అదేమిటి మాస్టారూ ! అన్నాను.

'అదేమిటి అంటావేమిటి నాయనా ! ఇది పికాఖపట్నం. అందునా సిరిపురం. ఇక్కడ కొబ్బరిబొండాలా దొరకవు. కూల్‌డ్రింకులా ఎండకు బాగా మరిగిఉంటాయి. చెరకురసమా ? అలాంటివి పెట్టాలని ఈ జంక్షన్‌లో ఎవరూ తలపెట్టరు. హోటళ్లా అలాంటివి ఇక్కడెలాగూ ఉండవు' అంటూ విచారించారాయన.

ఇంకా సింపురమేమిటి? అన్నీ శనిపురపు లక్షణాలు కనబడు తుంటేను - అన్నాను.

పేరు మారుపెట్టైనా సంతోషిద్దామని. ఒక్కొక్కళ్లు చూడు 'బాలాత్రిపురసుందరి' అని పేరు పెట్టుకుంటారు. చూడడానికి రుబ్బు రోలును మరిపిస్తారు. అలాంటిదే ఇదీను.

పోనీ సోడాలైనా దొరకవా? అన్నాను నేను.

ఓరీ! నిన్ను మరిపిద్దామని ఎంత ప్రయత్నించినా మళ్ళీ గుర్తు చేసుకుంటున్నావే! కొంచెం ఓపిక పట్టాలి తప్పదు. అవును అన్నట్టు మనవైపు సోడాలు తరచు త్రాగుతూ కనబడుతూ ఉంటారుకదా జనం. ఇక్కడ అలా ఎక్కువగా త్రాగడం నువ్వెవ్వుడైనా గమనించావా? అన్నారాయన ప్రశ్నార్థకంగా చూస్తూ.

"లేదు. మొదట్లో ఇక్కడసలు సోడాలు దొరకవేమో అనుకు న్నాను. తరువాత తెలిసింది దొరుకుతాయిగాని వాటికంతగా చెల్లుబడి ఉండదని" అన్నాను.

"ఎందుకో నే చెబుతాను విను. మనవైపు సోడాలకీ ఇక్కడ సోడాలకీ అసలు పోలికే ఉండదు. పేరులోనే పోలిక కనిపిస్తుంది మనలాంటివాళ్ళు మోసపోవడానికి. అన్నిటిని మించి ఇక్కడ సోడాల నుండి ఒక విధమైన కూడని వాసన జమాయించి గుబాళిస్తూ ఉంటుంది. గొడ్ల పాకలో కూర్చుంటే వేస్తూఉంటుంది చూడు అలాంటి వాసన అది. ఇంత ప్రత్యేకమైన సోడాలను సృష్టించగలగడం వీళ్ళకే సాధ్యమైంది" అన్నారాయన.

"వీళ్ళకది సాధ్యమవడం బాగానేఉందిగాని ఇవాళ మనంమాత్రం వీళ్ళకే నోచుకోలేము" అన్నాను.

"ఇదిగో నీ నోటినుండి ప్రాస బడింది. అటునుండి వస్తున్న ఆటో నాకళ్ళబడింది. ఇక కొద్దిసేపు ఓపికపట్టు. ఇంటికివెళ్ళి అక్కయ్య గారి చేతి మంచినీళ్లు త్రాగుదాం" అంటూ ఆటోలో కాలు పెట్టారాయన.

తప్పదా! అన్నట్లు చూశాను నేను.

ఏం చేద్దాంమరి! ఇది విశాఖపట్నం అందునా సిరిపురం అన్నట్లు చూశారాయన.

  

## వింత దొంగలు

**యూ**నివర్సిటీలో చదువుకొంటున్న రోజుల్లో రాత్రుల పూట మాస్టరుగారితో సరసమూ సార్థకమూ అయిన కాలక్షేపాలు చేస్తూ ఉండే వాళ్ళమని చెప్పాను కదా! అలాంటప్పుడు ఒక్కొక్కసారి మాస్టరుగారి ఇంటి నుండి బయల్దేరి అలా అలా సముద్రందాకా వెళ్ళివస్తూ ఉండే వాళ్ళం. అలా వెళుతున్నప్పుడూ, తిరిగివస్తున్నప్పుడూ, అక్కడఉన్న ప్పుడూ అన్నీ కబుర్లే, అన్నీ నవ్వుల పువ్వులే.

ఒకరోజున అలా బయల్దేరి సముద్రంవైపుగా సాగుతున్నాం. ఉన్నట్టుండి మాస్టరుగారు 'కృష్ణస్వామీ' అటుచూడు అన్నారు. నేను చూశాను. అక్కడ నేలంతా గోతులు గోతులుగా, గుంటలు గుంటలుగా

న్నవి. అవడానికవి ఇళ్ళస్థలాలు. ఇలా ఇంతింత పెద్దగోతులు ఎందుకు ట్టబడ్డాయా అని ఆశ్చర్యమేసింది నాకు.

కృష్ణస్వామీ! ఇంకెక్కడా లేని దొంగలు ఇక్కడ ఉన్నారోయ్! రికి చూద్దామన్నా నీకు ఇంకెక్కడా కనబడరు వీళ్ళు ఈ ఊళ్ళో ప్ప అన్నారు మాస్టరుగారు.

వాళ్ళెవరంటీ అంత ప్రత్యేకత గలిగినవాళ్ళు? అన్నాను నేను.

వాళ్ళే చాలా వింత దొంగలు. మట్టిదొంగలు. ఎక్కడయినా లు దోచుకుపోయారు, డబ్బుఎత్తుకు పోయారు, లూటీ చేశారు, డులు బద్దలుకొట్టారు అని వింటాం కాని పనికట్టుకొని మట్టిని త్తుకుపోయారు అన్నమాట వింటామా! ఆ ఘనత ఈ ఊరికే దక్కిం ంది. ఇక్కడ మట్టిదొంగలు విపరీతం. ఇవాళ స్థలం కొన్నావనుకో! ర్నాడు వెళితే అక్కడ స్థలం బదులు గొయ్యి కనబడితే నీవాశ్చర్య నక్కరలేదు. అలా కనబడకపోతేనే నీవాశ్చర్యపడాలి. చూశావా! ఇవాళ్లు ఎలాంటి అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నారో! వీళ్ళను సి ఇతర ప్రాంతాలవాళ్లు నేర్చుకోవలసింది ఇదొక్కటే కనబడు ంది నాకు! అన్నారాయన.

అది సరేగాని మాస్టారూ! వీళ్ళిలా మట్టిని ఎత్తుకుపోయి ఏం స్తారు? అని అడిగాను

అదేమి ప్రశ్నోయ్! ఈ ఊళ్ళోవాళ్లు వింటే ఆశ్చర్యపడగలరు మా! ప్రతివాడూ ప్రక్కస్థలాన్ని త్రవ్వి తనస్థలంలో పోసుకొని మెరక ఖకుంటూ ఉంటాడు. ఈ ప్రయత్నంలో ప్రక్క స్థలం ఏమవుతుంది? య్యి. అవుతుంది మరి అతను ఇల్లు కట్టుకోవాలంటే ఏం చేయాలి?

3)

ప్రక్కనున్న స్థలాన్ని తానూ అదే చేయాలి. ఒకవేళ వాడికి ఆ ప్రయ త్నం చేయడానికి ప్రాణం ఒప్పలేదనుకో! ఇక వాడి పాట్లు కుక్కలు నక్కలూ దేకవు. అదీ పరిస్థితి. బోధపడిందా? అన్నారాయన.

ఒక ప్రక్క ఆశ్చర్యం ఒక ప్రక్క నవ్వు నన్ను చుట్టు ముట్టాయి.



## నామకరణం బాగున్నది కానీ...

ఒకరోజున ఎప్పటిలాగానే రాత్రి పదిగంటల వేళ చినవాల్తే రోడ్డునుదాటి ఒక సన్నని రోడ్డుమీదుగా సముద్రంవైపుకు సాగుతున్నా ఒక గుడిశముందు ఒక ముసలమ్మ కూర్చుని ఉంది కాళ్ళను బా చాపి తాపీగా కూర్చుని నోటిలోపెట్టిన చుట్టను చేతితో తిప్పుతుం అదోవిధమైన ఆనందానుభూతిలో ఓలలాడుతోందామె. ఒంటిమీ కొంత భాగాన్నే కప్పగలుగుతున్నది చీరె. జాకెట్టుతో ఆ జాతివా పనే లేదనుకొంటాను. కండలు కాలానికి కరిగిపోయాయి. బొమికం నుండి వదులుగా ఎక్కడికక్కడ వేళ్ళాడుతోంది చర్మం. అంద చందం, ఓపిక, దారుఢ్యం అన్నీ ఆ శరీరం నుండి సెలవుపు కొన్నాయి. సెలవు పుచ్చుకోలేనిది ఒక్కటే కనబడుతోంది. అది చుట్ట అలవాటు. ఎన్నేళ్ళనుండి ఉన్నదో ఆమెకీ అలవాటు.

ఎన్నేళ్లు వచ్చినా ఆమెను వదిలిపోయేట్టు లేదు. ఎప్పుడో ఆమె ఈ శరీరాన్ని వదలిపోవాలి తప్ప. చిత్రం! ఆనందాన్ని అనుభవించడం అలవాటు చేసుకోవలసిన మనిషి తాను చేసుకొన్న అలవాటు నుండి ఆనందాన్ని కొనుక్కోవాలని చూస్తూ ఉంటాడు. అది కనుక్కుంటే అందేది తప్ప కొనుక్కుంటే దొరికేదా? ఈ సత్యాన్ని చాలాకాలం వరకూ మనిషి గమనించలేదు. అదే చిత్రం. సృష్టి విచిత్రం. ఇలా ఆలోచనలు సాగుతూ ఉండగా మాస్టరుగారితో ముందుకు సాగుతున్నాను నేను.

కృష్ణస్వామీ! ఏమిటి ఆలోచిస్తున్నావు? అన్నారు మాస్టరుగారు.

ఆ చుట్టను కాలుస్తున్న ముసలమ్మను గురించి.

అదినరే! ఆ దృశ్యాన్ని మరికాస్త పరిశీలనగా చూడు. ఆమె ఆ చుట్టను ఎలా కాలుస్తున్నది? అన్నారు.

పరిశీలనగా చూసిన నేను ఆశ్చర్యపడ్డాను.

మాస్టరుగారూ! ఏమిటది? ఆమె నిప్పులేకుండా పొగ తెప్పిస్తున్నది అన్నాను.

అదే చూడమంది మరి! నిప్పులేకుండా పొగరావడం కాదది. ఈ ప్రాంతంలో ఇలాంటివాళ్లు చాలామంది చుట్టకు నిప్పు ముట్టించి ఆ ముట్టించిన భాగాన్ని బయటకు వదిలిపెట్టకుండా ఆ చుట్టను తిప్పి లోపలికి పెట్టుకుంటారు. అప్పుడా చుట్ట అలా లోపల కాలుతూనే ఉంటుంది దాని పని అయిపోయేటంత వరకూ! ఇక్కడి చుట్టలను ఇలా కాల్చడాన్ని అడ్డపొగ అంటారు. నేను ఈ అలవాటులోని విచిత్రాన్నిబట్టి "రైలుచుట్టలు" అని నామకరణం చేశాను. ఆ ముసలమ్మ ఏంచేస్తోంది? చుట్టను త్రిప్పి నోటపెట్టి అచ్చం రైలులా పొగను వదలడంలా? ఆ

మామ్మ నోరు రైలు ఇంజనును మరిపించడంలా? అంటూ వివరించా రాయన తమ సహజమైన సరళదృష్టిని మేళవించి.

నాకు నవ్వొచ్చింది. నవ్వుకుంటూనే బాగుంది మాస్టారూ! నామకరణం అన్నాను.

కొంచెం ఆగి ఇలా అన్నారు మాస్టరుగారు. నవ్వుకోవడానికి మనం చేసిన నామకరణం బాగానేఉన్నది కానీ ఇలా చుట్టను రైలు చుట్టగా మార్చి కాల్చడంవల్ల చాలా ప్రమాదం సుమా! చుట్టను కాల్చడమే మంచిదికాదు. ఇలా త్రిప్పికాల్చడం అసలు మంచిదికాదు. ఈ అభ్యాసదోషంతో క్యాన్సర్‌ను కూడా కొని తెచ్చుకున్నవాళ్లున్నారు.

అంత ప్రమాదకరమైన పనిని వీళ్ళిలా కొనసాగిస్తున్నారు ఏమైపోతారు వీళ్లు అన్నాను బాధగా.

ఏం చేద్దాం! అలా అలవాటుపడిన వాళ్ళకు అలా కాలిస్తే తప్ప తృప్తి ఉండదు మరి. అంటూ పెదవి విరిచారాయన చేయగలిగినదేమీ లేదన్నట్లు.

మా నడక కొనసాగుతోంది. కానీ మా అడుగులే భారంగా పడుతున్నాయి.



## సాగుతూనే ఉంటుంది

ఒకరోజు ఉదయం పూట పెదవాల్తేరు వీధులగుండా సాగుతున్నాం. ఆ రోజున అక్కడ అంతా కోలాహలం హాలహలం అన్నట్లుగా ఉంది. రోడ్డుకు ఇటువ్రక్క కొందరూ అటువ్రక్క కొందరూ ఊగుతూ నిలబడి యధాశక్తి పోట్లాడుకొంటున్నారు. అలా నిలబడిన వారిలో ఆడా మగా ఇద్దరూ ఉన్నారు. ఒక దండును మరో దండు తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టుకుంటున్నారు.

వాళ్ళమధ్య నుండి మేం ముందుకు సాగాలి. ఆవేశాలతో ఊగిపోతున్న వాళ్ళు ఎక్కడ వచ్చి మా మీద పడతారో నన్నట్లు చూశాను నేను.

నా చూపులను గమనించిన మాస్టరుగారు, నువ్వేం కంగారు పడవలసిన పనిలేదు. నువ్వున్నది ఇప్పుడు కృష్ణా జిల్లాలో కాదు ఇక్కడ, విశాఖపట్నంలో, అందునా వాల్తేరులో.

ఇక్కడ పోట్లాటల సంగతి నీకు తెలియదనుకుంటాను. ఉత్త బిడ్డు పోట్లాటలివి. తెమలవూ! పెట్టవూ! అలా అవి ఏమైనా జరుగుతుందా అంటే ఏమీ జరుగదు.

ఇప్పుడు మనం వెళుతున్నామా? మళ్ళీ సాయంత్రం మనం తిరిగి వచ్చేటప్పటికి కూడా ఈ పోట్లాట తెమలదు! ఆ విషయంలో వీళ్ళ ఓపికను మెచ్చుకోవాలి.

ఇక్కడొక చిత్రముంది. ఎంతసేపు పోట్లాడుకున్నా రోడ్డుకు అటువైపున ఉన్నవారు ఇటురారు. రోడ్డుకు ఇటువైపున ఉన్నవాళ్లు అటు వెళ్ళరు. కానీ పోట్లాట మాత్రం ఆపరు. అదీ వీళ్ళ ప్రత్యేకత. అన్నారు.

అలాగా! చిత్రంగా ఉందే వీళ్ళపని! మరెందుకు వీళ్లు పోట్లాడుకోవడం? విషయం ఎంతకీ తేలదప్పుడు? అన్నాను నేను.

పిచ్చివాడా! విషయం తేలకుండా ఉండడమే వాళ్ళకు కావల్సింది. చక్కగా రేపు కూడ పోట్లాడుకోవచ్చు అన్నారాయన.

అదేమి ఆనందమండీ! అన్నాను నేను ఆశ్చర్యపోతూ.

అదో ఆనందం ఇక్కడి వాళ్ళకు అదే ఆనందం. ఇదేమన్నా కృష్ణా జిల్లా అనుకున్నావేమిటి మనం ఈ కాస్త దూరం నడిచే లోపున ఇక్కడొక హత్య జరిగినా ఆశ్చర్యపోనక్కరలేదు. ఈ కాసేపటిలోనే అన్నీ అయిపోవడం. ఒకవేళ పోలీసుల కన్ను మన మీద పడిందనుకో! సాక్షులుగా పట్టుకు పోవడం కూడా జరిగేది ఏమంటావు? అదీ! కృష్ణా జిల్లా లెక్క అంటే.

ఇది విశాఖ జిల్లా విచిత్రం. ఇక్కడ ఇబ్బందల్లా ఆ దారిన పోయే వాళ్ళకే! అన్నారాయన.

మేం మా దారిన సాగుతున్నాం.

వాళ్ళ పోట్లాట దాని దారిన అది సాగుతూనే ఉంది.

ఇంకా సాగుతూనే ఉంటుంది.

  

# పెద్ద జోక్ ఏమిటంటే

విశాఖపట్నం పూర్ణామార్కెట్ దగ్గర ఆటో దిగాం. అక్కడ ఉన్న చిన్న పనిని చూసుకొని కొత్త రోడ్డుకు దగ్గరలో ఉన్న ఒక సోదరుని యింటికి చేరేటందుకు మెల్లగా అడుగులు వేస్తున్నాం. ఈ కాస్త దూరానికి వాహనాన్ని ఆశ్రయించడం కన్నా కాళ్ళకు పని చెప్ప డమే మంచిదనిపించింది.

నడుస్తూ అటూ ఇటూ ఉన్న షాపులవైపు చూస్తున్నాను నేను.

కృష్ణస్వామీ! ఇలాంటి బజారు ఇంకా ఏ ఊళ్లో అయినా చూశావా? అడిగారు మాస్టరు గారు.

ఏం? మాస్టారూ! అలా అడుగుతున్నారు అన్నాను. చూడు చూడు బాగా చూడు నీకే తెలుస్తుంది. అన్నారాయన.

ఆయన చెప్పినట్లు చూస్తూ ఈ ఊళ్లో బజారుకు ఒక పద్ధతి ఉన్నట్లు కనిపించదు మాస్టారూ! అన్నాను.

మాస్టరుగారు చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు. మిగిలిన పట్టణాల్లో కిరాణా కొట్లన్నీ ఒకవైపు, బట్టకొట్లన్నీ ఒకవైపు అలా అన్నీ ఒక అమరికగా ఉంటాయి. ఈ ఊళ్లో మాత్రం ఏ కొట్టు ప్రక్కన ఏ కొట్టు ఉంటుందో ఆ దేవుడు కూడా ఊహించలేడు. బట్టల కొట్టు ప్రక్కన మంగలి షాపు ఉన్నా, మంగలి షాపు ప్రక్క

మిఠాయి దుకాణం ఉన్నా నీవేమీ ఆశ్చర్యపడనక్కరలేదు. అది విశా
స్పెషల్‌గా స్వీకరించడమే.

పెద్ద జోక్ ఏమిటంటే బట్టలషాప్ లోనికి వెళదామనుకొన్నవాడు ఒక అడుగు అటు పడితే మంగలి షాప్‌లో ఉంటాడు ఒకడుగు ఇటు పడితే బార్ షాప్‌లో తేలతాడు. మనం ఉండవలసినంత స్పృహలో ఉంటే తప్ప చేరదలచిన చోటుకు చేరలేం.

కొంచెం ఆగి ఆయన ఇంకా ఇలా అన్నాడు. ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా! నువ్వు ఎప్పుడూ ఏదో ఒకటి ఆలోచిస్తూ ఉంటావ్! బజారుకు వచ్చినపుడు అలా ఉంటే ఇక్కడ ప్రమాదం, సుమా! అని హెచ్చరించడానికి. ఈ ఊళ్లో బజారుకు వచ్చినపుడు మనమింకేం ఆలోచించగూడదు. దృష్టినంతా కూడ దీసుకొని చేరదలచిన గమ్యంపైపే చూడాలి.

అసలు ఈ ఊరు ఇలా ఎందుకు తయారయింది అని అడిగాను.

మాస్టరుగారిలా అన్నారు. మిగతా పట్టణాలయితే అవి ఈ నాటివికావు. అవి వందలేండ్ల చరిత్ర గలిగి ఒక క్రమం ప్రకారం పెరుగుతూ వచ్చినవి. విశాఖపట్నం అలాంటిదికాదు ఒక ప్లాన్ అంటూ లేకుండా అవసరాన్ని బట్టి అడ్డదిడ్డంగా పెరుగుతూ వచ్చిన పట్టణమిది. పోర్టుని బట్టి, యూనివర్సిటీని బట్టి, పరిశ్రమలను బట్టి అలా అలా పెరుగుతూ వచ్చింది. పాలకులూ, ప్రజలూ మొదటి నుండి జాగ్రత్తపడక పోవడంవల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. కనీసం ఇక పెరగబోతున్న పట్టణ విషయంలోనైనా వాళ్లు జాగ్రత్తపడాలి. లేకపోతే ఇంకా ఇష్టం అవుతుంది.

విశాఖపట్టణం ప్రాంతం, పరిసరాలు నిజానికి చాలా అందమైనవి. ప్రకృతి సౌందర్యానికి అనుగుణంగా ప్రజలు పట్టణాన్ని మలచుకో లేకపోయారు. ఇప్పుడు అనేక కారణాలవల్ల ఒక అంతర్జాతీయ నగరంగా ఈ విశాఖపట్టణం రూపొందబోతోంది. అలా రూపొందవలసిన అవసరం ఎంతైనా ఉంది. సామాన్యంగా మానవుల కన్నులకు పొడగట్టడం సాధ్యంకాని మహనీయులెందరో సూక్ష్మ శరీరాలతో నుండి దీని పురోభివృద్ధికై ఎన్నో విధాల తమ తపస్సును ధారపోస్తున్నారు.

ఇక్కడకు పరిపాలకులు, ఇక్కడి పాలకవర్గం కొంచెం ఇంగితంతో ప్రవర్తిస్తే ఇది 'ఇంటర్నేషనల్ సిటీ'గా ఎనలేని కీర్తిని గడించ గలుగుతుంది. ఇంత కథను పెట్టుకొని ఈ ప్రాంతాన్ని, ఈ బజారును ఇలా తయారు చేసుకొంటున్నాం అంటే ఏం చెయ్యాలో అంతుపట్టక నవ్వుతప్ప నీకీ కథంతా చెప్పాను.

ఆయనలా చెబుతున్నప్పుడు ఒక వంక ఆశ్చర్యం మరొక వంక ఆవేదన నన్ను పెనవేయసాగాయి.

ఇంతలో ఆ గోపాలుని ఇల్లు మాకెదురయింది. ఇక తర్వాతి కథ మొదలయింది.

  

చల్లటివేళ గుర్తుకు వచ్చారు.

ఆ రోజున రచనా వ్యాసంగాన్ని కొంచెం ముందుగానే నిలిపారు మాస్టరుగారు.

అదేమిటి మాస్టారూ! ఇంకా రాత్రి పన్నెండు కూడా కాలేదు. డేటు మారకుండా కథను ఆపడమా! అన్నాను నేను.

ఇవాళింక సాగేట్టు లేదు రచన అదొక ప్రవాహం. ఎంతవరకూ సాగాలి అన్నది దాని యిష్టం మీద ఆధారపడి ఉంటుంది. ఈ పూటకి ఏమైన కబుర్లు చెప్పు కాసేపు బాగుంటుంది. అప్పుడప్పుడు కబుర్లు చెప్పుకోవడం కూడా అవసరమే ననిపిస్తుంది ఏమంటావు?

ఏమంటాను. మీరు చెప్పిన కబుర్లన్నీ ఎప్పుడో ఒకప్పుడు నా నుండి రచనలుగా రూపుదిద్దుకుంటాయంటాను.

'నువ్వు చేస్తున్న పని బాగుంది. సన్నివేశాలనుండి వ్యక్తమవుతున్న సందేశాలను చక్కగా పట్టుకుంటున్నావు. పదిమందికి పనికి వచ్చేటట్లుగా అందించగలుగుతున్నావు' అన్నారాయన. ఆయన చూపులు తృప్తిని వ్యక్తం చేస్తున్నాయి.

మహనీయుల జీవితంలోని సన్నివేశాలూ అంటే అవి ఒక మహా కావ్యంలోని ఘట్టాల వంటివే కదా మాస్టరుగారూ! ఒకొక్కప్పుడు వారి

జీవితంలోని ఏదైనా ఒక ఘట్టమే ఒక మహాకావ్యం కావచ్చు. ఈ శతాబ్దంలో చాలా మంది కవులు ఖండ కావ్యాలను తీర్చిదిద్దడానికి ఇష్టపడుతున్నారు. నేను మీ జీవితంలోని కొన్ని ఘట్టాలను అనుభూతి ప్రదమైన ఖండికలుగా అందించగలగుతున్నాను. నా నుండి ఇలా జరుగుతున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది. పెద్దలకు దగ్గరగా ఉన్నందుకు వారి జీవితాల నుండి జాతికి కావలసిన సమస్వయాన్ని కొద్దిగానైనా అందించ గలుగుతున్నాం కదా అని.

నేను మాస్టరు గారివైపు చూశాను. మాస్టరుగారు నావైపు ఆశీః పూర్వకంగా చూస్తున్నారు.

కొద్ది క్షణాల తరువాత ఇలా అన్నాను: సందర్భం వచ్చింది కదా అని అడుగుతున్నాను. మీ గూర్చి నా నుండి వస్తున్న రచనలపైన మీ అభిప్రాయం ఏమిటి?

చెప్పమంటావా? అన్నారాయన.

చెప్పండి అన్నాన్నేను.

ప్రేమ కురిసే కన్నులతో నావైపు చూస్తూ ఆయనిలా అన్నారు. నా నుండి కొన్ని రచనలు దిగివస్తున్నాయి. వాటిలో నా నుండి దిగి వస్తున్న సందేశమంతా అనేక రూపాల్లో వ్యక్తమవుతున్నది. ఆ సందేశానికి తగినట్లుగా నేనేం చేస్తున్నాను అన్నది నీరచనల్లో రికార్డు అవుతూ ఉన్నది.

ఒక విధంగా చెప్పాలి అంటే నేనేం చెపుతున్నామా అన్నది నా గ్రంథాల్లో ఉంటుంది. నేనేం చేస్తున్నామా అన్నది నీ గ్రంథాల్లో ఉంటుంది. ఒక రకంగా చూస్తే మనిద్దరి రచనలూ ఒకే నాణానికి బొమ్మ, బొరుసుల వంటివి. ఇది నా అనుభూతి.

కొద్దిసేపు అనుభూతి ప్రదమైన మౌనం నడిచింది మా మధ్య.

నడుస్తున్న మౌనాన్ని శబ్దంగా రూపొందిస్తూ నేనిలా అన్నాను: మాస్టరుగారూ! పెద్దవాళ్ళ అందరి విషయంలోనూ ఇలాంటి ప్రయత్నాలు జరిగి ఉన్నట్లయితే జాతికి ఎంత మేలు జరిగేది! అనిపిస్తుంది నాకు.

నిజమేనోయ్ అన్నారాయన.

ఒక్క క్షణం ఆగి నేనిలా అన్నాను: ఆ పెద్దల దగ్గర కూడా ఇలా అంతరంగికులుగా మెలిగిన వారు ఎందరో ఉండి ఉంటారు. వాళ్ళు తాము పొందిన అనుభూతులనూ, సమన్వయాలను తమలోనే దాచుకోవడం లేదా సందర్భవశాన ఎప్పుడైనా తమకు దగ్గరైన వారికి మాత్రమే చెపుతూ ఉండడం చేస్తూ వస్తున్నారు. అలా కాకుండా ఆ సన్నివేశాలకు అక్షర రూపం యిచ్చి అందరికీ అందిస్తే ఎంత బాగుంటుంది. రాబోయే తరాలకు అవి తరుగని పెన్నిధులుగా మన కాలపు తీపి గురుతులుగా మిగిలిపోవూ! కేతన తన దశకుమార చరిత్రలో తిక్కన గారి జీవిత వైభవాన్ని గూర్చి కొద్ది సన్నివేశాలను తెలియజేశాడు. ఇప్పుడు మనం ఆ సన్నివేశాల నుండే తిక్కన గారి పరిపూర్ణమైన వ్యక్తిత్వాన్ని చూడగలుగుతున్నాం. మిగిలిన వారి గురించి మనకు తెలిసింది అంతంత మాత్రమే. కేతన వ్రాయకుండా ఉంటే తిక్కన గారిని గూర్చి కూడా మనకామాత్రమైనా తెలిసేది కాదు. నా బాధ ఏమిటంటే ఇప్పుడు ఈ శతాబ్దంలో మన మధ్య మనతో కలసి మెలగుతున్న పెద్దలను గూర్చి అయినా మనమలా వ్రాసి అందించడానికి శ్రద్ధ పెట్టలేకపోతున్నామే అని.

“నిజమే నీవన్నది. అంతరంగికులుగా పెద్దవాళ్ళ దగ్గర మెలగడానికి అవకాశం దొరికిన వారిలో ఎక్కువమంది తమకు అవకాశం

దొరికినందుకు మురిసిపోవడమో, గర్వించడమో చేస్తున్నారు తప్ప ఇంత దగ్గరగా ఆ పెద్దవాళ్ళతో మెలిగే అవకాశం లభించినందుకుగాను మనం మిగిలిన వారికి, రాబోయే తరాలకు ఏమి అందించగలుగుతున్నాం అన్న ఆలోచన వాళ్ళకు రావడంలేదు. జాతీయ స్పృహ, లోకహిత దృష్టి వీళ్ళలో ఎక్కువమందికి లోపించడమే దీనికి కారణం. ఈ మహాకవి మనవాడు. ఈ మహాకవి ముఖ్య అనుచరులలో మనం ఒకళ్ళం అని అనుకుంటున్నారు తప్ప ప్రపంచం అంతటికీ చెందిన ఒక మహాకవి చెంతన మసలగలిగే అవకాశం మనకు ఈయబడింది అని గ్రహించి దానిని సద్వినియోగం చేసుకోలేక పోతున్నారు వాళ్ళు. అలా చేసుకుని ఉంటే తిరుపతి వేంకటకవుల గురించీ, విశ్వనాథవారి గురించీ, ఒక శ్రీశ్రీ గురించి ఇంకా మన పెద్దలందరి గురించీ మనకెంత తెలిసేదో? వాళ్ళ వాళ్ళ జీవిత ప్రయాణాల్లోని మలుపులు మనకెంతగా బోధపడేవి? అన్నారాయన. అలా అంటున్నప్పుడు ఆయన గొంతు కొంత జీరగాసాగింది.

అదే మాస్టారూ నా బాధ. మనసాటివారి గురించికూడా ఎక్కువ సందర్భాలలో ఇలా జరిగి ఉండవచ్చు అని ఊహించి చెప్పవలసి వస్తున్నదీ అంటే అదెంత దురదృష్టం. మీరు చెప్పినప్పుడు ఒక విశ్వనాథ గురించో, ఒక శివశంకరశాస్త్రిగారిని గురించో, ఒక కాటూరినిగురించో, ఒక రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిని గురించో చెబుతున్నప్పుడు ఒంటికి గగుర్పాటు కలుగుతుంది. మనస్సునకు పారవశ్యం కలుగుతుంది. హృదయంలో ఒక విధమైన స్పందన కలుగుతుంది. ఇలాంటి ఘట్టాలు ఇంకా వాళ్ళ జీవితాలలో కోకొల్లలుగా ఉండి ఉంటాయిగదా! అవన్నీ ఒక పద్ధతిలో వ్రాయబడి మనచేతికి అందితే ఎంతబాగుండును అనిపిస్తుంది.

ఉదాహరణకి విశ్వనాథ సత్యనారాయణగారు విజయవాడలో ఉండేవారు. గుడిపాటి వెంకటచలంగారు కూడా చాలాకాలం విజయవాడలోనే

ఉన్నారు వాళ్ళిద్దరూ జాతిని ఇటు అంచున ఒకరు, అటు అంచున ఒకరూ నిలబడి దగ్గరకురమ్మని పిలిచినవారు. విశ్వనాథ సంప్రదాయాన్ని గాఢంగా ప్రేమించే వ్యక్తి. చలం స్వేచ్ఛను విపరీతంగా అభిలషించే ఒక తీవ్ర భావుకుడు. వీళ్ళిద్దరూ ఒకానొక సందర్భంలో ఒకచోట కలుసుకున్నారనుకోండి. అప్పుడెలా ఉండి ఉంటుంది? అని హృదయం ఉన్న తెలుగువాడికి అనిపించదూ ! ఇలా ఏ ఇద్దరు పెద్దలు కలిసినా ఎలా ఉండి ఉండేదో ఆ దృశ్యాలు అక్షరరూపం ధరిస్తే ఎంత బాగుండేది.

నీ కోసమేనా అన్నట్టుగా నాకొక చక్కటి సన్నివేశం గుర్తుకొస్తోంది కృష్ణస్వామీ! విశ్వనాథవారితో నేను సార్థకంగా కాలం గడుపుతున్న రోజుల్లో జరిగిన సన్నివేశం అది. అప్పటికి చలంగారి 'మైదానం' బయటకు వచ్చింది. పెద్ద సంచలనాన్ని సృష్టిస్తోంది. మైదానం నవలలో చలం చూపిన సాహసానికి విభిన్న మనస్తత్వాలవారు ఎవరికి తగినట్లు వారు స్పందించసాగారు. చలాన్ని మెచ్చుకునేవారు కొందరూ, ఖండించేవారు కొందరూ ఇలా రకరకాలుగా తయారయ్యారు.

అలాంటి సమయంలో చలం, విశ్వనాథ ఒకచోట కలుసుకోవడం జరిగింది. విశ్వనాథవారి ప్రక్కన నేనున్నాను. ఆ సన్నివేశంలో ఇంకెవరూ ఉన్నట్టు నాకు గుర్తు లేదు. పరస్పరం పరామర్శలయినతరువాత చలం అడిగాడు విశ్వనాథను. మీరు నా మైదానాన్ని చూశారనుకుంటా అని.

'చూశాను' అని ఊరుకున్నారు విశ్వనాథ.

కొద్దిసేపాగి "దానిపైన మీ అభిప్రాయం తెలుసుకోవాలని నా అభిలాష" అన్నాడు చలం.

విశ్వనాథ చలంవైపు సూటిగా చూస్తూ "నేను ఉన్నది ఉన్నట్లు చెపుతానని నీకు తెలుసుకదా!" అన్నారు.

'తెలుసు. కనుకనే అడుగుతున్నాను' అన్నాడు చలం.

"సమాధానం కొంచెం ఘాటుగానే ఉంటుంది. చెప్పమంటావా?" అన్నారు విశ్వనాథ.

"చెప్పండి. మీరు చెప్పినదాన్ని అర్థం చేసుకునేటందుకు ప్రయత్నిస్తాను. నాకు నచ్చితే తప్పక మీ అభిప్రాయాన్ని స్వీకరిస్తాను. నచ్చలేదనుకోండి, ఎందుకు నచ్చలేదో చెపుతాను" అన్నాడు చలం.

అయితే విను. అంటూ విశ్వనాథ ఇలాచెప్పారు: "నీ మైదానంలో కథ నీకు బాగా గుర్తుందికదా! ఒక బ్రాహ్మణస్త్రీ ఒక మహమ్మదీయుడితో లేచి వెళ్ళిపోయి స్వేచ్ఛావిహారం చేసినట్లు వ్రాశావు నువ్వు. బాగుంది. నే నొకటడుగుతాను చెప్పు. ఒక మహమ్మదీయ స్త్రీ ఒక బ్రాహ్మణయువకునితో లేచి వెళ్ళిపోయి అలాగే స్వేచ్ఛావిహారం చేసినట్లుగా నువ్వు వ్రాయగలవా? దమ్ముంటే అలా వ్రాయకపోయావా? అప్పుడు కాదు ఇప్పుడు వ్రాయగలవా?"

చలం ఆలోచనలో పడ్డారు. నేలచూపులు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నారు.

విశ్వనాథ మళ్ళీ ఇలా అన్నారు: "నీ సిద్ధాంతం సంగతి అలా ఉంచుదాం. అది నీకు నచ్చిందీ, నువ్వు చెప్పుతున్నావు. నే నిప్పుడు బయటపెట్టింది నీ బలహీనతను గురించి. ఒక్కసారి లోతుగా ఆలోచించు. సమాధానం దొరుకుతుందేమో?"

కొద్దిసేపు మౌనంగా గడిచింది. ఆ మౌనం చాలా భారం అనిపించింది

విశ్వనాథ ఇంకా ఇలా అన్నారు: స్వేచ్ఛ లేకపోవడమే గనుక సమస్య అయితే అది మన స్త్రీల విషయంలోకన్నా మహమ్మదీయస్త్రీల విషయంలో ఇంకా ఎక్కువ సత్యం. ఏమంటావు? వాళ్ళూ మనసమాజం లోని భాగమేకదా. నిజంగా నువ్వు స్వేచ్ఛాప్రియుడివే అయితే ముందు వాళ్ళకొరకు పోరాడాలి. పోరాడు చూద్దాం. నీకు తెలుసు అలాపోరాడడం మొదలుపెడితే నీవుండవనీ, వాళ్ళు విన్నించరనీ. ఇక తేలిగ్గా దొరికింది మనవాళ్లు. మనవాళ్లు వాళ్ళనేమన్నా పడిఉండడమే తప్ప ఎదురు చెప్పరు. ఈ బలహీనతను ఆసరాగా తీసుకుని నీ నోటికొచ్చినట్టు వ్రాశావు. అదేమిటీ అంటే స్వేచ్ఛకై పిలుపు నిస్తున్నానూ అంటున్నావు. అసలు కథావస్తువును స్వీకరించడంలో నీకు స్వేచ్ఛ ఉన్నదా! ఆలోచించు. ఇదంతా నువ్వు తెలిసి చేశావని అనను నేను. అప్రయత్నంగానే నీ నుండి వచ్చిందని తెలుసు నాకు. కానీ బలహీనమయిన నీ మానసికస్థితి ఈ కథకు నిన్ను ప్రేరేపించిందని గుర్తించుకో! నిన్ను నీవు విశ్లేషించుకో! నీకు నీవు బోధపడు! అప్పుడు వ్రాయి! అది అందరికీ పనికివస్తుంది.

చలం మరింత ఆలోచనలో పడ్డాడు. అతనికి మారు మాట్లాడ డానికి ఇంకేం కనుపించలేదు. "ఆలోచిస్తాను మీరు చెప్పిన దాని గురించి" అంటూ నిదానంగా నడుచుకుంటూ వెళ్ళాడు.

"మైదానం చలానికి ఇప్పుడు నిదానం వచ్చిందన్నమాట" అన్నాను. మాస్టరుగారు ఇంకా ఇలా అన్నారు: నిదానమూ వచ్చింది ఆపైన రమణ మహర్షి దగ్గరకు చేరిన తరువాత విధానమూ తెలిసింది"

"రమణ మహర్షిగారితో పరిచయం అయిన తరువాత ఆ వెలుగులో చలం వ్రాసిన 'మార్తా' అనే నవల చాలా అద్భుతంగా ఉంటుంది మాస్టారు. అలాగే 'జీసస్ జీవితం' అనే నవలకూడా చాలా బాగుం

యుంది. ఈ రెండు నవలలూ చదువుతూ ఉంటే ఆనాడు మనముండి అక్కడ ఏసు ప్రభువుతో కలసి వస్తున్నట్టే ఉంటుంది.

ఆపైన చలంగారు చేసిన బైబిలుకు అనువాదం 'శుభవార్త' నిజంగా లోకానికే ఒక శుభవార్త అది. హీబ్రూ భాషలో తరువాత ఇంత చక్కటి బైబిలు ఇంక ఏ భాషవారికీ అందలేదేమో ఇక ఆయన వ్రాసిన 'విర్వికల్పం' నిజంగా ఇప్పటి కాలానికి కావలసిన గ్రంథమది. భగవద్గీతకు, బైబిలుకు మధ్యగల పోలికలనూ, సమన్వయాన్ని చాలా చక్కగా తేట తెలుగులో చూపించారాయన. నిజంగా ఈ నాలుగు గ్రంథాలూ చాలు ఆయన ఆచంద్రతారార్కమూ ఒక ఋషి అయివ ట్రవిగా నిలబడి పోవడానికి."

ఒక్కక్షణం ఆగి ఇలా అన్నాను: "చిత్రం మాస్టరుగారూ మిమ్మల్ని అలా అట్టిపెట్టి నేను చెప్పేస్తున్నాను."

మాస్టరుగారు చిరునవ్వు నవ్వి ఇలా అన్నారు. "మాకు కావలసింది ఇదే? మమ్మల్ని ఇలా ప్రక్కన అట్టిపెట్టుకుని లోకానికి కావలసిన సమన్వయాన్ని మీరు గొంతెత్తి అందించగల్గడం. పెద్దల జీవిత సన్నివేశాలను ఎలాంటి సమన్వయ దృష్టితో చూడాలో నీకు చక్కగా పట్టుబడుతోంది. నిజంగా నాకు చాలా సంతోషంగా ఉంది.

చలం గారిదికూడా ఒక తపన. ఆ తపన తపస్సయి రమణ మహర్షి సాక్షాత్కారించడంతో లోకానికి పనికివచ్చే వెలుగుగా పరిణమించింది. విశ్వనాథ, చలం ఇద్దరూ సమాజ శ్రేయస్సు కోసం అహర్నిశలూ పరితపించినవారే. ఎవరికి కావలసిన సమన్వయం వారికి దొరికింది. ఎవరిద్వారా జరుగవలసిన పని లోకానికి వారిద్వారా జరిగింది.

చాలా బాగుంది. చల్లటివేళ గుర్తుకు వచ్చారు. నీవన్నట్టుగా చేటు మారి నట్టుందిచూడు. మరింక పడుకుందామా? మొత్తంమీద బలేవాడివి. నువ్వు ప్రక్కనుంచేచాలు ఎక్కడెక్కడివో గుర్తుకు వస్తాయి అంటూనే మాస్టరు గారు నిద్రలోకి జారిపోయారు. ఎప్పుడూ అంతే. ఆయనకు నిద్రపట్టడానికి క్షణంచాలు. ఆయన నిద్రపో దలచుకోవాలేగాని.

నేనూ ఆయన మార్గాన్నే అనుసరించాను. అది ధర్మం కదా!

  

## ఒక రాగి చెంబును కొనండి

ప్రతి సంవత్సరము విశాఖలో ఉన్న సోదర బృందం శివ రాత్రి సందర్భంగా ఇరవై నాలుగు గంటల పాటు అఖండ రుద్రాభిషే కాన్ని నిర్వహించడమనే ఒక చక్కటి సంప్రదాయం ఉంది. ఒక సంవ త్సరం శివరాత్రి మర్నాడు ఆ రుద్రాభిషేకాన్ని నిర్వహించిన సోదర బృందంలోని కార్యకర్తలు మాస్టరుగారిని కలియవచ్చారు. విన్న కార్య క్రమం అంతా సజావుగా నడిచి పోయింది కదా! అంటూ మాస్టరుగారు వారిని పరామర్శించారు.

మీ ఆశీర్వచన బలంతో అంతా సవ్యంగా నడిచి పోయింది మాస్టారూ! అంటూ వాళ్ళు ఒకపొట్లాన్ని మాస్టరు గారి చేతిలోపెట్టారు.

ఏమిటిదీ అంటూ ఊడదీసి చూశారు మాస్టరుగారు.

అందులో కొంత డబ్బు ఉంది.

ఇదేమిటీ? అన్నారు మాస్టరుగారు!

కార్యకర్తలు చేతులు నలుపుకుంటూ వినయాన్ని వ్యక్తంచేస్తూ మీరు చెప్పినట్లు రుద్రాభిషేక నిర్వహణకు కావలసినవన్నీ వాటికవిగా నడచివచ్చాయి. అలాగే సోదర బృందం నుండి ధనం కూడా దానికదిగా నడచి వచ్చింది. రుద్రాభిషేక నిర్వహణకు పోను మిగిలిన డబ్బు. ఇది. దీనిని మీకు సమర్పిద్దామని వచ్చాం అన్నారు. చేతులు జోడించి నిలుచున్నారు.

ఒక క్షణం ఏదో ఆలోచిస్తున్నట్లు కనబడిన మాస్టరుగారు ఇప్పుడు దీన్నేం చేస్తారూ? అని అడిగారు.

మీరేం చేయమంటే అది అన్నారు వాళ్లు. చేతులను అలాగే జోడించి ఉన్నారు.

కొద్ది క్షణాలు ఆలోచించినట్లుగా ఉండి తలపైకెత్తి మాస్టరుగారు ఇలా అన్నారు. అయితే ఒక పని చేయండి.

అయ్యా! చిత్తం అంటూ ఇక సెలవియ్యండి అన్నట్లు చూశారు వాళ్లు.

మాస్టరుగారు గంభీరంగా ముఖంపెట్టి ఈ డబ్బుతో ఒక రాగి చెంబును కొనండి అన్నారు.

ఆ కార్యకర్తలు అలాగేనంటూ తలలూపారు.

నవ్వబోతున్న పెదవిని వద్దని పంటితో నొక్కుతూ ఏం కొంటారు కదూ అన్నారు.

తివ్వరుండా. తమ ఆజ్ఞ అన్నారు వాళ్ళు.

మీరు కొనబోయే రాగి చెంబు వల్ల చాలా ఉపయోగాలు ఉం టాయి. మనకు రెండు నెలలకొకసారైనా ఏదో ఒక ఉత్సవం వస్తూ ఉంటుంది. వచ్చినపుడల్లా ఉత్సవ నిర్వహణలో మీకున్న దక్షత వల్ల ఎంతో కొంత డబ్బు మిగులుతూ ఉంటుంది. అలా మిగులుతూ వచ్చే డబ్బులన్నిటినీ చక్కగా మీరిప్పుడు కొనే రాగి చెంబులో వేసుకోవచ్చు. ఏమంటారు? బాగుంది కదూ నే చెప్పింది. అలాచేయండి? ఇక మీ ఉత్స వాలు మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతాయి. ఏమంటారు? అంటూనే మాస్టరుగారు ఇక ఆపైన మౌనముద్రను వట్టారు.

కార్యకర్తలకు ఆయన మాటలు అర్థమయ్యీ అర్థంకానట్టు ఉన్నాయి. వాళ్ళు మాస్టరుగారి వైపు అలానే చూస్తూ ఉండిపోయారు.

మాస్టరుగారి ముఖం మరింత గాంభీర్యాన్ని సంతరించుకో సాగింది. పైకి తిరిగిన కనుపాపలతో కొద్ది క్షణాలు ఆలోచించి తిరిగి కార్యకర్తల వైపు చూస్తూ ఏం ఇంకా నిలబడ్డారేం? రాగిచెంబును కొన డానికి బయలుదేరలేదేం? కొనేదేదో పెద్దది కొనండి. లేకపోతే కొద్ది కాలంలోనే రెండవది అవసరమవుతుంది. వెళ్ళిరండి. మీ దృష్టిని చెంబు పైన పెట్టండి. ఊఁ ఇక వదండి అంటూ గద్దింపుగా అన్నారు.

కార్యకర్తలకు జంకు కలిగింది. మామూలుగా అంటున్న మాటలు కావని బోధపడసాగింది. మాస్టరుగారి మాటలకు పరమార్థం ఏమిటా? ఇప్పుడు ఇక కర్తవ్యం ఏమిటా అని వాళ్ళు ఆలోచించ సాగారు. ఊరికే మధన పడిపోసాగారు.

ఎంతసేపని వాళ్ళిలా వడగలరు? కర్తవ్య మేమిటో సూచించండీ, మమ్మల్ని కనికరించండి అన్నట్లు చూశారు వాళ్ళు.

ఏట్టకేలకు సూటిగా వాళ్ళవైపు చూస్తూ మాస్టారిగారిలా అన్నారు. ఉత్సవం జరుగుతూ ఉన్నప్పుడు కావలసిన వసువులు ధనం వాటికవిగా నడిచి వచ్చాయని మీరే చెప్పారు. అవి నడచి వచ్చినదెందుకు? మీరిలా పొట్లాం కట్టడానికా? ఉత్సవాన్ని నిండుగా నిర్వహించడానికా? ఉత్సవం దాని నిర్వహణకు కావలసినదేదో అదే రప్పించుకుంటున్నప్పుడు మీ చేతుల మీదుగా చక్కగా నిర్వహించవలసింది పోయి మధ్యలో మీరు వేలు పెట్టటమెందుకు? ఈ కక్కుర్తి ఎందుకు ?

అందుకే అన్నాను. ఈ మిగిలిన డబ్బులతో ఒక రాగి చెంబుకు కొనమని. దేవుడు చక్కటి అవకాశాలను ఇచ్చినా మానవుడు వాటి మొదల తన దౌర్బల్యాలను ప్రసరింపచేసి కక్కుర్తి పడుతూ ఉంటాడని మీరు చక్కగా నిరూపించారు. వెళ్ళిరండి. ఆ పనేదో చూడండి.

వాళ్ళకు అప్పటికి జరిగినదేమిటో బోధపడింది. క్షమించండి మాస్టారూ అన్నట్లు చూశారు వాళ్ళు. మీరెంత హాయిందాగా బ్రతికే మార్గాన్ని చూపిస్తున్నా మా మనస్సులు పూర్వాభ్యాసాల పట్టుచేత ఇంకా ఒక పట్టాన దారిన పడలేక పోతున్నాయి. కరుణించండి. ఈ కక్కుర్తుల నుండి మాకు విమోచనాన్ని అనుగ్రహించండి అన్నట్లు జాలిగా చూస్తున్నారు వాళ్లు.

మాస్టరుగారు ప్రకాశిస్తున్న కన్నులతో చూస్తూ ఇక వెళ్ళిరండి ఈ డబ్బుల్ని రాబోయే రుద్రాభిషేకంలో రుద్రునిసేవకు సిద్ధంగా ఉంచండి అంటూ వెన్ను తట్టి పంపించారు.



## కొన్ని కొన్ని తప్పవు

ఒక ప్రత్యేకమైన పనిమీద ఒకసారి అవనిగడ్డకు వచ్చారు మాష్టరుగారు. ఉదయం అవనిగడ్డ చేరిన మాష్టరుగారు మధ్యాహ్నం కల్లా తిరుగు ప్రయాణం కట్టారు. మాష్టరు గారితో పాటు విశాఖ నుండి ఒక సోదరుడు వచ్చాడు. బందరు నుండి విశాఖపట్నం ఒక బస్సు బయల్దేరుతుంది. దాన్ని గుడివాడలో 'క్యాచ్' చెయ్యాలిమనం అన్నారు మాష్టరుగారు.

బయల్దేరక తప్పదా? అన్నానేన్నేను.

అవకాశం ఉంటే ఉండనా? అన్నారాయన.

అయితే నేనూ గుడివాడ దాకా వస్తున్నాను అన్నాను.

రమ్మని నేనే చెబుదామనుకున్నాను అన్నారాయన.

ముగ్గురం అవనిగడ్డలో గుడివాడ బస్సెక్కాం.

గుడివాడ చేరగానే బస్టాండులో కనుక్కున్నాం మా బస్సు సంగతి. ఆ బస్సు కాన్సిలయిందని మళ్ళీ రాత్రికే బస్సని అక్కడ తేల్చి చెప్పారు. మాష్టరుగారు తనతో విశాఖనుండి వచ్చిన సోదరుని వైపు చూశారు అతను కొంచెం గతుక్కుమన్నాడు. నేనే కారణమంటారా? అన్నట్లు చూశాడతను. మరింకెవరు నాయనా? అన్నట్లు చూశారు

మాష్టరుగారు. అతనుంటే చాలు కార్యక్రమాలు తప్పక బిడ్డు తోముతా యని మాష్టరుగారు తరచూ ఆట పట్టిస్తూ ఉండేవారు. నిజానికి ఆ కార్యక్రమాలు కూడా అలా బిడ్డు తోముతూనే ఉండేవి. మాష్టరుగారి భాషలో చెప్పాలంటే కార్యక్రమాలు బిడ్డు తోమవలసి ఉన్నప్పుడల్లా సోదరుడు అక్కడికి ఆకర్షింప బడతాడన్న మాట.

మాష్టరుగారు చిరునవ్వు నవ్వుతూ ఇంకాచేసేదేముంది? అలా వెడదాం పదండి. ఎక్కడైనా లాడ్జిలో ఒక రూము సంపాదించి కాసేపు కాలక్షేపం చేద్దాం అన్నారు.

రోడ్డు మీద సాగుతున్నాం, ఎండ మండుతోంది. ప్రయాణం చేసి వచ్చామేమో శరీరాలు విశ్రాంతిని కోరుతున్నాయి.

ఎదురుగా ఒక చెరుకురసం అమ్మే బండి కనిపించింది. మాష్టరుగారు నా వైపుతిరిగి చెరుకురసం త్రాగుదామా? అనే లోపున ఆ సోదరుడు వెళ్ళి చెరుకురసం సిద్ధం చేస్తావా? అని ఆ బండివాడిని అడిగాడు. ఆ బండివాడు ఏమనుకున్నాడో ఏమో అవకాశం లేదని చేతులు త్రిప్పాడు.

ఆ సోదరుడు జాలిగా మా వైపు చూశాడు.

మాష్టరుగారు మనకిది మామూలేగా అన్నట్లు ఓదార్పుగాచూశారు అతను మమ్మల్ని చేరుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

నేను యధాలాపంగా ఆ చెరుకురసం బడ్డీవైపు చూశాను. చిత్రం అక్కడొక కుర్రవాడు ఐదు పైసలు చేతిలోపెట్టి చెరుకురసం పోయించు కుంటున్నాడు.

నేను సోదరునివైపు చూశాను. అతను తలవంచుకొన్నాడు. కొంతదూరం అలానే నడిచాం. చెరుకురసం త్రాగే ప్రయత్నానికి స్వస్తి చెప్పాం.

ఎదురుగా ఒక లాడ్జి మా కళ్ళబడింది.

సోదరుడు ఆగలేక వెళ్ళి ఎప్పటి లాగానే వెనుతిరిగాడు.

కొంతదూరం నడిచాం. మరో లాడ్జి కళ్ళబడింది.

మళ్ళీ సోదరుడు ఆగలేక వెళ్ళి అడిగాడు. ఎప్పటి లాగానే వెను తిరిగాడు.

ఇంకా కొంతదూరం నడిచాం. మా కాళ్ళు మారాం చేస్తున్నాయి వాటిని బ్రతిమాలుతూ ఉండగా ఇంకొక లాడ్జి కనిపించింది.

సోదరుడు ఎప్పటిలాగానే వెళ్ళబోతూ ఉండగా మాష్టరుగారు గభాల్న అతని చొక్కాను పట్టుకుని లాగి ఎట్టకేలకు అతన్నిఆపడంలో విజయం సాధించి, ఇదిగో ఈ ఊళ్ళో ఇంకా ఇదొక్కటే లాడ్జి ఉన్నట్టుంది. ఈ సారి నువ్వు సాహసం చెయ్యడం కన్నా మన వాణ్ణి పంపిద్దాం అంటూ నన్ను కనుక్కోమన్నారు. అదృష్టం వరించిందన్నట్టు ఆ లాడ్జిలో రూము దొరికింది. పట్టువదలని విక్రమార్కుడిలా ఎట్టకేలకు సాధించామనుకుని ఆ రూములో ప్రవేశించాం. మేం రూములో ఉందామనుకున్న కాలంలో సగభాగం రోడ్డుమీదే ఖర్చయిపోవడం విశేషం.

మాష్టరుగారికి ఇష్టమని లాడ్జి నుండి క్రిందకు వెళ్ళి బందరు మిఠాయి దుకాణంలో జీడిపప్పు పాకం, నల్లహల్వా, సన్నకారపూస తీసుకుని పైకి వచ్చాం.

కొంచెం సేద తీర్చుకొని ఎదురుగా పెట్టబడిన తమకిష్టమైన తినుబండారాలను రుచి చూడడానికి ఉపక్రమించారు మాష్టరుగారు. మాకు పెట్టి తాను నోట్లో వేసుకున్నారో లేదో ఎక్కడనుండి వచ్చాడో లాడ్జి బాయ్ ఒకడు ఆళువుగా అశ్రువులు రాలుస్తూ తనకథనంతా చెప్పసాగాడు

మాష్టరుగారికి, విషయం బోధపడేదాకా నిని ఓదార్పుగా అతనిపై పుమూచి టేబుల్‌పైన ఉన్న తినుబండారాలను అతనిచేతిలో పెట్టేసి వంపించారు మాష్టరుగారు. దాన్ని చూసుకొని అలా కాసేపు వందుకునే ప్రయత్నం చేశారు.

ఇంతలో విశాఖ బస్సువేళ కావచ్చింది. మెల్లిగా లాడ్జి ఖాళీచేసి బస్టాండుకు బయల్దేరాం.

బస్టాండులో బస్సుకోసం వెయిట్‌చేస్తూ ఉండగా నాకున్న అనుభవాన్ని పురస్కరించుకుని మాష్టరుగారితో ఇలా అన్నాను. మాష్టరుగారూ విశాఖకు సామాన్యంగా రెండు రకాల బస్సులు బయల్దేరుతూ ఉంటాయి. ఒకటి కానిస్టేబులు బస్సు. రెండవది సబ్ఇన్‌స్పెక్టర్ బస్సు మరివాళ ఏ బస్సు వస్తుందో ఏమో? మన అదృష్టం పైన అధారపడి ఉంటుంది అన్నాను.

ఊరికే బస్సుల పేర్లు చెప్పి సస్పెన్సులో పెడతావేం? వాటిని గురించి తగుమాత్రం వివరిస్తే మేం కూడా తెలుసుకుంటాం కదా! అన్నారు మాష్టరుగారు.

ఏమీలేదు. కానిస్టేబుల్ బస్సు అంటే అది ఎర్రబస్సు మామూలు పాసింజర్ బస్సులా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అంతకన్నా అధ్వాన్నంగా కూడా ఉండవచ్చు. మరి అలాంటి బస్సును విశాఖదాకా ఏక ధాటిగా ఎందుకు వేస్తారో తెలియదు?

మాష్టరుగారు, అలాగా అంత దారుణంగా ఉంటుందా? అన్నట్లు చూశారు.

ఇక సబ్ఇన్‌స్పెక్టర్ బస్సు అంటే అదిపాపం బాగానే ఉంటుంది ఎక్స్‌ప్రెస్ బస్సది. తెలుపురంగులో కొంత, ఖాకీరంగులో కొంత

ఉంటుంది. అందుకని దానికి సబ్ఇన్స్పెక్టర్ బస్సని పేరు పెట్టాం. అదొచ్చిందనుకోండి మీకు హాయిగానే ఉంటుంది అని నేను వివరిస్తూ ఉండగా బస్సురానే వచ్చింది. మా ముఖాలు నీరసమై పోయాయి అదే బస్సన్నది ఇక చెప్పక్కర్లేదు.

ఏమోయ్ కృష్ణస్వామీ ఇంతసేపూ వివరించి వివరించి, ఊరించి ఊరించి చివరకు కానిస్టేబుల్ బస్సే తెప్పించావ్ అన్నారు మాష్టరు గారు.

ఆయన గొంతు జాలి గొలిపేటట్లుగా ఉంది

నేనేం చేయగలను మాష్టరుగారూ అన్నట్లు చూశాన్నేను.

నువ్వేం చేయగలవు. ఈ సారి మన యాత్ర ఇలా యాతనగా సాగవలసి ఉంది. కొన్నికొన్ని తప్పవు అన్నట్లుగా చూసి ఆ సోదరుని వైపు తిరిగి ఇక ఎక్కుదామా? అన్నారు మాష్టరుగారు.

ఓ. అలాగే అన్నట్లు ఎక్కేశాడా సోదరుడు.

ఈ బస్సయినా వచ్చినందుకు ఇంతవరకూ సంతోషిద్దాం. మధ్యలో ఇది మారాం చేయకుండా విశాఖచేరితే అదే పదివేలు. కృష్ణస్వామీ మీ అవనిగడ్డ యాత్ర ఇలా చిరస్మరణీయంగా మిగిలిపోతుంది సుమా! అని నాకు మాత్రమే వినపడేటట్లుగా అంటూ బస్సెక్కి టాటా చెప్పారు మాష్టరుగారు.



# నేను పాడగలిగింది ఒకే పాట

1973 ప్రాంతంలో విశాఖజిల్లాలోని మాడుగులకు దగ్గరలో ఒక విశాలమైన ప్రాంగణం, దానికి మిథిల అని నామకరణం చేసి దానిపైన కొంత దృష్టిని ప్రసరింపచేశారు మాస్టరుగారు. 73 లో కార్తీకమాసంలో ఆ ప్రాంతానికి విశాఖలోని సోదరబృందం అంతా ప్రత్యేకమైన వాహనాలపైన విహారయాత్రకు తరలివెళ్ళాం.

అప్పటికే ఆ ప్రాంగణంలో రెండు పెద్ద పెద్ద వర్ణశాలలు ఏర్పాటు చేయబడ్డాయి. వసతులూ, వంటలూ అక్కడ. ఇక విహారానికి ఆ ప్రాంగణమంతా తగిన ప్రదేశమే. ఆ ప్రాంగణానికి ఒక ప్రక్కగా కొండల మధ్య నుండి ఒక సెలయేరు. కాలాన్నిబట్టి తరుగుతూ, పెరుగుతూ ఉండే ఆ సెలయేటిని మాస్టరుగారు చంద్రకళ అని పిలిచేవారు. అప్పటినుండి అందరూ దాన్ని అలాగే పిలవడం వరిపాటి అయింది.

ఆ చంద్రకళకు ప్రక్కగా తగుమాత్రం ఎత్తులోఉన్న ఒక కొండ చివరిభాగాన సోదరబృందం అందరూ చేరారు. మధ్యలో మాస్టరుగారు చుక్కల్లో చంద్రుడిలా. అందరం ఏవేవో కబుర్లు చెప్పుకోవడం ప్రారంభించాం. ఎక్కువమంది ఆ ప్రదేశ సౌందర్యాన్ని గురించీ, ఆ సెలయేటి సోకడల గురించీ, మనస్సునకు అక్కడ కలుగుతున్న హాయి

యొక్క తీపతెప్పల గురించీ ఒకరితో ఒకరు ప్రస్తావించుకో సాగారు. కలుగుతున్న అనుభూతులను పరస్పరం కలబోసుకోసాగారు.

ఇంతలో సోదరుడు పున్నయ్యశాస్త్రికి పారవశ్యం పొంగుకొచ్చి మాస్టరుగారు రచించిన గోదావైభవంలోని పద్యాలు మనస్సునను తట్టి నవి తట్టినట్టుగా గొంతెత్తి ఆలపించడం మొదలుపెట్టాడు. అంతే వాతావరణం నిశ్శబ్దమై మరింత అనుభూతితో నిండిపోసాగింది. మాస్టరుగారు అతనివైపు ఆశీస్సులను, అభినందనలనూ రంగరించి చూస్తున్నారు. అతను మరింత విజృంభిస్తున్నాడు. మాస్టరుగారు మరింతగా హర్షామోదాలను వ్యక్తం చేస్తున్నారు. ఒడలు తెలియని స్థితిలో సోదరబృందం చాలాసేపు గడిపింది. కాని అంతసేపని ఎవరికీ అనిపించలేదు. కాలానికి అతీతంగా సాగిన కావ్యగానం అది. పాడిపాడి పున్నయ్య ఇక పాడలేక కలుగుతున్న పారవశ్యాన్ని ఆపలేక మాస్టరుగారి పాదాలపై పడి ఆ పాదాలను తన ఆనందబాష్పాలతో కడుగుతున్నాడు. ఎన్నెన్ని జన్మలకైన ఇక్కడ మీపాదాల దగ్గర ఇంత చోటివ్వండి చాలు అని మనస్సుతో అడుగుతున్నాడు. మాస్టరుగారు అతనిని చేతితో నిమురుతూ లేవనెత్తే చూపులతో ఆశ్వాసిస్తూ అలాగే ఉండిపోయారు కాసేపు.

తెప్పరిల్లిన పున్నయ్య లేచి కూర్చున్నాడు అంత నిశ్శబ్దంలో నుండి ఎవరో ఒక రన్నారు మాస్టరుగారూ! మీరు ఒక పద్యం పాడండి అని. ఇంకెవరో అన్నారు మాస్టరుగారూ! పద్యమే కాదు, ఒక పాట కూడా పాడాలి అని. అందరూ అవును నిజమే ఇప్పుడు మాస్టరుగారు పాడాలి అన్నట్లు చూశారు.

మాస్టరుగారు చిరునవ్వుతో అందరివైపూ ఒక్కసారి చూసి మీ కోరిక బాగానే వుంది కానీ నేను పాడగలిగింది ఒకే పాట. అది వేలం పాట అన్నారు.

అందరం నవ్వుతున్నాం. ఆయన పాడలేదన్న అసంతృప్తి అలాగే ఉన్నా ఆయన విసిరిన చెణుకు అందరికీ నవ్వు తెప్పించింది. ఇలా పట్టయిన సన్నివేశాలలో ఒక చిత్రమైన చెణుకువేసి తప్పించు కోవడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య.

విసిరిన చెణుకుకు వివరణగా మాస్టరుగారు ఇలా అన్నారు: వ్రాయడం వరకే నావంతు. ఇక పాడడం అది నా పని కాదు. మా పున్నయ్యలాంటి వాళ్ళ పని. నేను వ్రాసిన వాటిని అనుభూతి ప్రవదంగా పాడాలి అంటే పున్నయ్య పాడాలి. రసవత్తరంగా పాడాలి అంటే ధారా రామనాథశాస్త్రి పాడాలి. మన పని మరి వ్రాయడమే.

అదిమటుకు మీరెక్కడ వ్రాస్తున్నారు? మీరు చెప్పడమేగా అంటూ సరసమాడారు సన్నిహితుడొకరు.

ఓరీ! నా పని డిక్టేట్ చెయ్యడమే అంటావు. మొత్తంమీద మీరందరూ కలిసి నన్నొక డిక్టేటర్‌ని చేస్తున్నారే అన్నారు మాస్టరు గారు.

చెయ్యడమ్మేమిటి? మీరు కాదేమిటి, అన్నానేనేను.

ఓరీ! నువ్వు ప్రక్కనే ఉన్నావా? అన్నారాయన.

ఉండడమేమిటి? మీరే ఉంచుకుంటేను అని నేను అంటూఉండగా బృందం వాహ్యాళి నుండి భోజనాలకు లేచి నడవసాగారు.

దూరాన వున్న పర్ణశాలలు పాకశాలలై మంచి మంచి వాసనలతో సమయం మించిపోతోంది! రమ్మంటున్నాయి.

  

## కవులకు భూవసతి

ఒకసారి మాస్టరుగారు ఒక కావ్యాన్ని ఆవిష్కరించవలసి వచ్చింది. ఆవిష్కరణ సభ రాజమండ్రిలో జరుగనున్నది. మాస్టరు గారు సాహిత్య సభలకూ, కవితా గోష్ఠులకూ దూరంగా ఉండడం మొదలుపెట్టి అప్పటికి రెండు దశాబ్దాలు దాటి ఉంటుంది. మళ్ళీ ఇప్పుడు రాజమండ్రివారు మాస్టరుగారిని ప్రతిమాలి ఒప్పించి ఈ పని పెట్టారు.

ఆ కొద్ది రోజులూ రాత్రిపూట రచనా వ్యాసంగం పూర్తికాగానే ఆవిష్కరించవలసిన ఆ కావ్యాన్ని కొంత కొంతగా చదివి వినిపిస్తూ ఉండే వాడిని. అలా ఆ కావ్య పఠనం సాగుతున్నప్పుడు మాస్టరు గారు మధ్య మధ్యలో ఎన్నెన్నో అంశాలు చెప్పేవారు. మరెన్నెన్నో ఛలోక్తులు కొన్ని నాపైనా కొన్ని వ్రాసిన ఆ కవిగారిపైనా మరికొన్ని ఇంతవరకూ కావ్యాలు వ్రాసిన కవులందరిపైనా ఇలా యథేచ్ఛగా సందర్భాన్ని బట్టి విసరబడుతూ ఉండేవి.

ఆ రోజు రాత్రి నిద్రకు ఉపక్రమించేముందు కొంతసేపు ఆ కావ్య పఠనం చేద్దామా అన్నారు మాస్టరుగారు.

తప్పకుండా అంటూ ఆ కావ్యాన్ని అందుకుని చదివి వినిపించ సాగాను.

కావ్యపఠనం సాగుతూ ఉండగా మధ్యలో తమ చూపులతోనే నా పఠనాన్ని నిలిపి చిరునవ్వులు చిందిస్తూ ఇలా అన్నారు మాస్టరు గారు.

"ఈ కవులకు నిజ ప్రపంచంలో ఇళ్ళూ, స్థలాలు ఎంత వరకూ ఉంటాయోగాని ఈ కావ్య ప్రపంచంలో మాత్రం వీళ్ళకు అపారమైన భూవసతి ఉంటుంది."

ఆ చలోక్తికి నాకు నవ్వు వచ్చింది. కాని మరికొంత వివరణ అవసరం అనిపించింది. ఆ విసురును గూర్చి కొంచెం వివరిద్దురూ అన్నట్లు చూశాన్నేను.

తప్పకుండా వివరిస్తాను అన్నట్లు చూస్తూ ఆయనిలా అన్నారు. "మహాకవుల కావ్యాలను ప్రక్కనపెట్టి మామూలు కవుల కావ్యాల్లో ఎవరికావ్యాన్ని చేతబట్టినా అందులో నీకు నేను చెప్పినట్లు అపారమైన భూవసతి కనిపిస్తుంది. పద్యాలు మామూలుగా సాగకుండా మారాంపెట్టి ఈ భూవసతిని పొందిగాని మరి కదలవు.

ఏమిటీ అలా చూస్తున్నావు? నా వివరణ 'కుప్పుస్వామి మేడ్ డిఫికల్ట్' అన్నట్లు ఉంది కదూ! నీదైతే 'కృష్ణస్వామి మేడ్ ఈజీ' అన్నట్లు ఉంటుంది. ఇంతకీ నేను చెప్పదలచింది ఏమీ లేదు. ఆ కవులకు కొన్ని కమ్మలు కట్టదలిచాను కమ్మలు కట్టినా కమ్మగా కట్టాలి కదా!" అంటూ ఆయన నవ్వారు.

"ఏమిటీ నవ్వుతున్నారు" అన్నాను.

"ఏమీ లేదు. నీవాసన నాకూ కూడా అంటుతోంది" అన్నారు.

"వాసన అంటడంకాదు ప్రాపలు అంటడం" అన్నాన్నేను.

"ఓరీ. ఇప్పటికిప్పుడే ప్రాసలా. నీకు తెలుగులేదు" అన్నా రాయన.

"పొగడ్తలు సరేగాని కమ్మలను గూర్చిన మీ కమ్మటి వివరణ కావాలి." అన్నాన్నేను.

మాస్టరుగారు ఇలా చెప్పారు : "ఏమున్నదీ. ఈ మామూలు కవుల కావ్యాల్లో రెండు మూడు పద్యాలకొకచోటైనా ఇలన్, ఇద్ధరన్, ధరణిన్, భువిలోన్, ధాత్రిన్ అంటూ ఏదో ఒక రూపంలో భూమిని గూర్చిన స్మరణ ఉంటుంది. దానికే నవ్వుతూ నేను ఈ కవులకు కావ్యాల్లో భూవసతి ఎక్కువగా ఉంటుంది అన్నాను. నిజానికి సొంత ఇల్లూ, గోడూ అమర్చుకోగలిగారో, లేదోగాని కావ్యాల్లో మాత్రం యధేచ్ఛగా భూమిని ఆక్రమించేస్తూ ఉంటారు వీళ్ళు, ఈ భూమంతా మాదే అన్నట్లు."

ఒక్క క్షణం ఆగి ఆయన ఇంకా ఇలా అన్నారు : "ఇవన్నీ పద్యాలు వ్రాసేటపుడు పాదాలను పూరించడానికై మామూలు కవులు పడే పాట్లు. భావం అయిపోయింది. గణాలను సరిపెట్టాలి. ఛందస్సు తప్ప కూడదు కదా మరి. అందుకని ఈ తిప్పలంతా. పద్యాల్లో ఏర్పడిన ఖాళీనంతా భూమిని ఏదో ఒక రూపంలో అంటే ఇలన్ అనో, ధాత్రిన్ అనో అక్కడ ఏర్పడిన ఖాళీని బట్టి ఆశ్రయించి భర్తీ చేస్తుంటారు ఈ కవులు."

"కమ్మగా ఉన్నది మీ వివరణ. అందరినీ, అన్ని రకాల వారినీ భరిస్తున్నట్లే ఈభూమి తననలా అర్థం పర్థం లేకుండా అదే పనిగా ఉపయోగించుకుంటున్న ఈ కవి శ్రేష్ఠులను కూడా భరిస్తూ వస్తున్నది. ఏం చేస్తుంది పాపం?" అన్నాన్నేను.

"ఇప్పుడిక మనం మటుకు ఏంచేయగలం? ఒక్కటే చేయగలం. కాసేపు నిద్రపోగలం." అంటూ కాళ్ళ గట్టుసున్న దుప్పటిని మెడ వరకూ పైకి లాక్కున్నారు మాస్టరు గారు.

  

## ఇక ఇరుకున పడతారు

ఏమిటి కృష్ణస్వామీ అలా తినలేక తింటున్నావ్. ఆదోసె బాగుండలేదా ? బాగుండకపోతే వదిలేసేయ్. ఆ ప్రక్కన పెట్టి చెయ్యి కడిగేసుకో. మన అంచనా తప్పిందన్నమాట. అక్కడ రుచిగా, శుచిగా చేస్తారని అక్కడనుంచి తెప్పించాను. భారతదేశంలో బాగుండడం ఎంతసేపు. కాస్త పేరురాగానే ఇక శ్రద్ధ తగ్గుతుంది. ఇదుగో ఈ పళ్ళు తీసుకో "అని నా ముందున్న బల్లపైన పెడుతూ, "పేరు వచ్చిన తరువాత కూడా పనిపైన శ్రద్ధ తగ్గకుండా ఉండటం కావాలి. భారతీయులకు అక్కడ పట్టు నిలబడితే మన దేశ పరిస్థితే మారిపోతుంది'' అన్నారు మాస్టరుగారు.

మధ్యాహ్నం మూడు దాటింది. అప్పటికి చాలాసేపటి నుండి వ్రాస్తున్నాము. మధ్యలో కాఫీ బ్రేకులో ఈ కథంతా.

"ఏమిటి మాస్టరుగారూ ఏమిటో ఆలోచిస్తున్నారు" అన్నాన్నేను. "ఏంలేదు. ఈ దోసె కథను చూస్తుంటే నాకు చిన్నప్పటి సన్నివేశం ఒకటి గుర్తుకొచ్చింది. ఒకసారి మేమొక నలుగురు మిత్రులం కలసి హోటల్‌కు వెళ్ళాం. ఇలాగే దోసెకు ఆర్డరిచ్చాం. వాడు తెచ్చాడు. మావాళ్ళందరూ దోసెను తింటున్నారు కాని తినలేక తినలేక తింటున్నట్లుగా వాళ్ళ ముఖాలే చెబుతున్నాయి. నేనుమాత్రం కొంచెం రుచిచూసి చూసింది చాలని ఆ దోసెను అలాగే వదిలేశాను ఏంకృష్ణా నువ్వు తినడం లేదేమి? అని అడిగాడు మామిత్రుడు మీరు తింటున్నారా అని అడిగాను నేను. అతను కొంచెం బాధగా ముఖం పెట్టి బాగుందలేదనుకో ఏం చేస్తాం మరి. బోలెడంత డబ్బులు పెట్టి కొనుక్కున్నప్పుడు, నువ్వే చెప్పు అన్నాడతను.

నాకు నవ్వొచ్చింది. నేనిలా అన్నాను : "డబ్బులు ఎలాగో పోయాయి ఉన్న ఆరోగ్యంకూడా ఈదోసెను తిని పోగొట్టుకోవడం అవివేకం కదా! అందుకే అలా వదిలి పెట్టాను.

మిత్రులు అందరూ ముందు కొంచెం ఆశ్చర్యంగా చూశారు కాని కొంచెం సేపటికి నేను చెప్పిందే నిజమనే నిర్ణయానికి వచ్చారు. వాళ్ళ ఆశ్చర్యం మెల్లగా చిరునవ్వుగా మారింది. మాకిట్టని ఈఅంశాలన్నీ నీకెలా తడతాయయ్యా. మేమందరం డబ్బులవైపు చూసి కక్కుర్తి పడ్డాం నువ్వు చూడవలసిన వైపు చూశావ్. ఇదెలా సాధ్యమయింది నీకు? అన్నారు వాళ్ళు.

ఏముందీ. కొంచెంగా కామన్ సెన్స్ ఉంటేచాలు ఇలాంటివి తట్టడానికి. అంటూ మంచి నీళ్ళు త్రాగి లేచాన్నేను. ఇదీ దోసె కథ. బాగుందికదూ" అన్నారాయన.

ఒక క్షణం ఆగి మళ్ళా ఇలా అన్నారు. "భారతీయులు మరీ డబ్బు మనుషులై పోయారు. ఆ డబ్బుమీద చూపిస్తున్న శ్రద్ధలో వెయ్యోవంతయినా చేస్తున్న పనిమీద చూపిస్తే ఎంత బాగుండును. ఒకసారి మా చిన్నతనంలో మా నాన్నగారితో కలిసి బ్రాహ్మణ భోజన హోటలుకు వెళ్ళాం. భోంచేస్తున్న మా నాన్నగారు గభాలున జీర్ణకోశం దగ్గర ఇలా రెండు వ్రేళ్ళతో గట్టిగా నొక్కి పట్టేశారు. ఏమిటని అడిగాను. ఇప్పుడు చెప్పను అన్నట్లు చేయి ఊపారు.

అన్నంలో ఎలా ప్రవేశించిందో ఏమో? ఒక తేలుపిల్ల ప్రవేశించిందట. హోటలు వాడిపైన నమ్మకంతో తింటున్న మా నాన్నగారి నోట్లోకి అలవోకగా వెళ్ళి పోయిందది. ఆయన జీర్ణకోశంలో కదులున్నది తేలుపిల్లగా గమనించి గట్టిగా రెండు వ్రేళ్ళతోనూ నొక్కేశారు. తేలుపిల్ల అక్కడే కాలం చేసింది. అది బయటకు వచ్చేసిన తరువాత మా నాన్నగారి ద్వారా మాకు తెలిసింది.

ఇలా ఉంటాయి మన హోటళ్ళ లీలలు. అందుకే మన పెద్దవాళ్ళు గతి లేకపోతే తప్ప బయటి వాళ్ళను ఇష్టపడే వారు కారు.

బాగుంది కానీ ఇక హోటళ్ళపైన ధ్వజమెత్తడం ఆపేసి మళ్ళీ మన పనిలోకి దిగుదామా'' అన్నారాయన. "ఏమి అలాంటి హోటళ్ళ మీద ధ్వజమెత్తడం మాత్రం మన పనికాదా" అన్నానేను.

"అది నీ పని. పక్కలో ఈ సన్నివేశాలు నువ్వు ఇరికించేస్తావు. హోటళ్ళ వాళ్ళందరూ ఇక ఇటువైపు పడతారు. ఏమంటావు అంటూ చేతనున్న గ్రంథాన్ని తెరిచి పట్టుకున్నారాయన.

"నిజంగా ఇరికించ వలసిన సన్నివేశాలే మాస్తారూ!" అని అన్నానేను.

  

## మా వాడి లోకజ్ఞత

ఒకనాటి రాత్రి రచనా వ్యాసంగం పూర్తి అయిన తరువాత మాటల మధ్యలో ఒక మిత్రుని ప్రసక్తి వచ్చింది. మాష్టరుగారికి గత కాలంలోని ఆ సన్నివేశాలన్నీ ఒక్కసారి కనులముందు మెదిలాయి. కాలచక్రం అంచులను త్రిప్పి చూస్తూ మాష్టరు గారిలా అన్నారు. " మా మిత్రుడు వయస్సులో నా కన్నా చాల పెద్ద. కాని మా సాన్నిహిత్యం వయస్సులకు అతీతమైనది. అతను చాలా గడుసువాడు కూడా. అతనికున్న లోకజ్ఞానం అపారం. లోకంలో మెలిగేటప్పుడు తనకున్న ఆ జ్ఞానాన్ని ఒడుపుగా వాడేవాడతను.

ఒకసారి హైదరాబాదు అనుకుంటాను మేమిద్దరము కలసి వెళ్ళాం. అక్కడున్న రెండు రోజుల్లో ఇద్దరం కలసి చాలా ఇళ్ళు తిరిగాం. పనుల మధ్యలో చూడవలసిన వాళ్ళందరిని చూసెయ్యాలన్నది అతని వ్రతం. ఇంకేముంది. సందు దొరికినప్పుడల్లా సందులన్నీ తిరిగే వాళ్ళం.

అతనికొక మిత్రుడున్నాడు. అతను ఆ మధ్యనే కాలం చేశాడు. ఇప్పుడామెను చూడటానికి వెళ్ళాలి. సరే వెళ్ళాం. వెళ్ళి కూర్చున్నాం. కాసేపటికి డోరు కర్టెన్ తొలగించుకొని ఆమె వచ్చారు. అక్కడున్న బల్లపైన కూర్చుంటూ మా మిత్రుడి వైపు కొంచెంగా [illegible]

చూశారు. ఆమె కళ్ళలో నీళ్ళు తిరగబోతున్నాయి. అది గమనించిన మా మిత్రుడు, నేఁ ఇంతకు ముందు వచ్చానమ్మా, అంటూ ఓదార్పుగా అన్నాడు. అంతే ఆమె కళ్ళల్లో తిరగబోతున్న నీళ్ళు ఆగిపోయాయి. ఆ పైన మామూలుగానే జవాబిచ్చింది.

బయటకొచ్చిన తరువాత మా మిత్రుణ్ణి అడిగాను. ఇంతకు ముందు నీవెప్పుడొచ్చావిక్కడికి అని

అదే లోకజ్ఞత అంటే, అన్నాడతను.

ఆశ్చర్యంగా చూశాన్నేను.

నా ఆశ్చర్యాన్ని గమనించిన అతను ఇలా వివరించాడు : సామాన్యంగా లోకంలో ఒక పద్ధతి ఉంది. భర్త పోయినపుడు ఆ తరువాత మొదటిసారిగా ఎవరు చూడటానికి వచ్చినా స్త్రీలు కన్నీళ్ళు కారుస్తూ దుఃఖిస్తారు. ఆ పైన రెండవసారి కాని మూడవసారి కాని అదే వ్యక్తి వెళ్ళినప్పుడు వాళ్ళకంత దుఃఖం రాదు. అప్పుడు మామూలుగానే మాట్లాడుతారు. మనం మొదటిసారిగా చూడడావి. వచ్చామని ఆమె కంటతడి పెట్టబోయింది. నేను వెంటనే ఇంతకు ముందు వచ్చానమ్మా అని చెప్పడంతో ఆమె అంతలోనే సర్దుకుంది. జరిగిన దెలాగూ జరిగిపోయింది. ఇపుడు మరొక్కసారి ఆమెను ఏడిపించడం ఎందుకు? ఇలా మాటి మాటికీ ఒక్కొక్కరు వచ్చి ఆమెను ఏడిపిస్తూనే ఉండి ఉంటారు. అందుకే నేను లోకజ్ఞతను ఉపయోగించి ఆమెకు మనకు కూడ ఇబ్బందిని తగ్గించాను. ఏమంటావు ? అన్నాడు.

మా వాడి గడుసుతనానికి నాకాశ్చర్యం వేసింది. వాడన్నీ ఇలాంటి పనులే చేస్తూ ఉండేవాడు. లోకం పోకడలు తెలిసి లోకంలో మెలగాలన్నది వాడి సిద్ధాంతం. ఇలాంటి వాళ్ళు నలుగు

పైరెడుగురు మిత్రులుండేవారు. ఒక్కొక్కరిదీ ఒక్కొక్క రకంకి ఇలా సందు దొరికినప్పుడల్లా గుర్తొస్తూ అప్పటి సంతోషాన్ని ఇప్పటికీ మనస్సుకు అందిస్తూ ఉంటారు వాళ్ళు పైపై పాలా అయినట్లయింది. ఇక ఈ పాటకు కట్టి పెడదామా ?" అన్నారాయన.

అలాగే అన్నట్లుగా తలూపాన్నేను. ఆయన నుండి వెలువడే రచనలు ఒక ఎత్తు. రచనల సమయంలో కాని, రచనా వ్యాసంగం పూర్తి అయిన తరువాత కాని ఆయనతో నడిచే సంభాషణలు ఒక ఎత్తు అనిపిస్తూ ఉంటుంది నాకు.

  

## గజారోహణం

ఈ మనుషులకి కామన్ సెన్స్ చాల తక్కువ. పెద్దపెద్ద ఆడంబరాలూ, హడావిడులు మర్యాదలూ మన్ననలూ చేస్తారుకాని ఆ వచ్చిన వాళ్ళకి కావలసిన కనీస అవసరాలను గురించి పట్టించుకోరు. నిజానికి పట్టించుకోవలసింది వాటి గురించే.

రాత్రి 11 గంటలు దాటుతోంది. రాధామాధవంలో ఎప్పుడూ వ్రాతపని సాగే గదిలో కూర్చుని ఉన్నాం. ఆ గదిలోనే మాష్టరుగారి పడకా, విశ్రాంతి మొదలైనవన్నీ. మనుషుల మనస్తత్వాన్ని గూర్చి సమీక్షిస్తున్న మాష్టరుగారి ముఖంలో ఒక చిత్రమైన కళ కనబడు

తున్నది. కొంత మందలింపు, కొంత గాంభీర్యం, కొంత సరసం కలిసి ఆ ముఖకవళికల్లో వ్యక్తమవుతున్నాయి.

ఏం మాస్టారుగారూ రోజూ జరిగిన సన్నివేశాలను గురించేనా మీరంటున్నది అన్నానేను.

"అవునమ్మాయ్. అంత హడావిడి చేశారుకదా! అన్ని ప్రాంతాల నుంచి వచ్చిన వాళ్ళకు స్నానపానాలకూ, కాలకృత్యాది అవసరాలకూ కావలసిన ఏర్పాట్లను చేయడంలో మాత్రం ఏమాత్రం శ్రద్ధను పెట్టలేక పోయారు. అసలు శ్రద్ధ పెట్టవలసింది అక్కడే. మనవాళ్ళకు ఆర్భాటాలమీద ఉన్నదృష్టి అవసరాలమీద ఉంటే ఎంత బాగుండును. అందుకే అన్నది వ్లావెడ్‌స్కీ "కామన్ సెన్స్ కామన్ సెన్స్ అంటూ ఉంటారు. కాని అది అంత కామన్‌గా ఎక్కడా కనబడడంలేదు. ఎక్కడో వెదగా చూడగా వేయిమందిలో ఏ ఒకరిద్దరిలోనో మాత్రమే కనబడుతూ ఉంటుందది. నా దృష్టిలో అది చాలా రేర్ సెన్స్. కాని అందరూ దాన్ని 'కామన్ సెన్స్' అని పిలుస్తూ ఉంటారు. ఆ పిలుపు నాకు వింతగా వినబడుతోంది' అని. ఆవిడ చెప్పిన మాటలు అక్షరాలా నిజం సుమా! ఇలాంటి సన్నివేశాలు జరిగినపుడల్లా నాకు ఆవిడ మాటలు చెవుల్లో వినవడుతూనే ఉంటాయి.

నాకొక ఘట్టం గుర్తుకొస్తోంది- రాజమండ్రిలో కొంతకాలం క్రితం జరిగిన ఘట్టం అది. ఒక పెద్ద కవిగారికి సన్మానం ఏర్పాటు చేశారు అక్కడి పెద్దలంతా కలిసి. ఇలాంటలాంటి సన్మానం అనుకున్నా వేమిటి? గజారోహణంతో కూడిన సన్మానం. ఆ కవిగారు కవిత్వంలోనే కాక వయస్సులోకూడా చాలా పెద్దాయన. పండు వృద్ధు. ఇక్కడికీ అక్కడికీ కదలడం మానేసి ఇంటిలో మంచాన్నే అంటిపెట్టుకొని ఉంటున్న ఆయన్ని ఎలాగో పట్టుబట్టి ఒప్పించి పట్టుకొచ్చారు.

నరే ఏమయిందీ! ఆయన రైలు ఇలా దిగారోలేదో అలా అలంక రించిన ఏనుగు అంబారీపైన ఆయన్ని అతికష్టంమీద ఎక్కించారు. కష్టం వాళ్ళకు కాదు. ఎక్కించబడుతున్న ఆయనకి. పాపం ఆముసలా యన వీళ్ళ చేతుల్లోపడి ముద్దయిపోయారనుకో."

"ముద్దుగా చేయవలసిన సన్మానాన్ని ముద్దగా చేశారన్నమాట." బాగుంది అన్నాన్నేను.

"ఆగాగు. అప్పుడే ప్రాసలన్నీ వేసేయకు. ఇంకా కధ చాలా ఉంది. అప్పుడే ఏమయింది?"

అయితే చెప్పండి అన్నట్లు చూశాన్నేను.

ఆయన ఆ కధను కొనసాగించారు. "ఊరేగింపు మొదలైంది. ఊరంతా తిరుగవలసిన ఊరేగింపది. ఏ వీధికి రాకపోతే ఆవీధి వాళ్ళకే కోపం రావచ్చు. ఏమంటావ్? ఇక ఆ కవిగారి పని అయిపోయింది. ఒప్పుకోవడమైతే ఆయన చేతిలో ఉందికాని ఇప్పుడు వీళ్ళ బారినుండి ఆయన తప్పుకోగలడా?

ఇది చాలక ఆయనకొక చిన్న ఇబ్బంది. అదేమిటంటే అతి మూత్రవ్యాధి. కాసేపటికి కాసేపటికి బాత్‌రూమ్ దర్శనం ఆయనకు తప్పనిసరి. ఈ కార్యకర్తలేం చేశారూ, రైలుపెట్టె నుండి డైరెక్టుగా ఏనుగుమీద ఆయన్ని కూర్చోపెట్టారు. కూర్చోపెట్టిన మరుక్షణంనుండి పూనకంలాంటి ఆవేశంతో ఆయన్ని ఊరేగించడం మొదలుపెట్టారు.

ఇక ఆయనను గురించి పట్టించుకోడానికి పూనుకున్నవాడెవడు? పోనీ ఆ రైలు దింపుతున్నప్పుడయినా, ఆయనా మనలాంటి మనిషే కదా! మనలాంటి అవసరాలు ఆయనకీ ఉంటాయికదా! అని వీళ్ళకనిపిం చిందా? లేదు. ఏమండీ ఇక్కడ కాసేపు విశ్రాంతి తీసుకోండీ అని

ఆయన అవసరాలను తీర్చుకోవడానికి కావలసిన సమయమిచ్చి ఏదో ఇంత తినిపించి, ఇంత త్రాగించి ఆయనను ఏనుగెక్కిస్తే ఎంత బాగుండేది. ఆయనను చూడగానే వీళ్ళ అభిమానం ఆవేశంగా పరవళ్ళు త్రొక్కింది తప్ప ఈమాత్రం ఆలోచన ఏ ఒక్కరికీ రాలేదు.

ఇక చూడు. ఆయన ఇబ్బంది ఇంతింత కాదు. ఎవరికీ చెప్పుకునేది కాదు. చెప్పుకోవడానికి సిద్ధపడినా అక్కడ వినేటందుకు ఎవరు సిద్ధంగా ఉన్నారు. పాపం. ఆయన నరకయాతన అనుభవిస్తున్నాడు. చేస్తున్నవాళ్ళకది ఘనసన్మానం. చూస్తున్నవాళ్ళకది మహా వైభవం. ఆయనకేమో ఘోర నరకం. ఇదీ పరిస్థితి.

ఇదేం సన్మానంరా నాయనా. ఇదెప్పటికవుతుంది? అసలీ సన్మానం నుండి నేను బ్రతికి బయటపడతానా? కొంపదీసి వీళ్లు దీనినే నా అంతిమయాత్రగా రూపొందించరు కదా? ఎవరికి చెప్పేది? ఎవరిక్కడ వినేది? ఓ దైవమా! నీవే నన్ను దయచూడాలి అంటూ దీనంగా ముఖంపెట్టి ఆకాశంలోనికి చూస్తున్నారాయన. ఆ దేవుడి దయవలన ఎట్టకేలకు ప్రాణాలతో ఉండగానే ఊరేగింపు పూర్తిచేయగలిగారు వాళ్లు.

క్రిందకు దింపి ఎలాఉంది అయ్యా మా సన్మానం. మీ మనసుకు నచ్చిందా అన్నట్లు చూశారు వాళ్లు.

మనసుకు నచ్చడం ఎలా ఉన్నా నా దేహంమాత్రం తొంభై తొమ్మిదిపాళ్లు చచ్చిందిసుమా అన్నట్లుచూస్తూ నవ్వలేని నవ్వు నవ్వారా పెద్దాయన.

కృపస్వామీ ఎలా ఉంది కథ" అన్నారు మాస్టరుగారు.

"ఇది కథకాదు మాస్టారూ వ్యథ. ఇంత చెప్పాలి అంటే వధ" అన్నాన్నేను

చూశావా మనుషుల మనస్తత్వాలు! చపలమైన అంశం నుండి మనుషుల మనస్సు చిత్రంగా ఎలా మారిపోతూ ఉంటుందో చూశావా? మనదూ, మన తోటి వాళ్ళకి ఎప్పటికప్పుడు కావలసినదేమిటో తెలిసి సంచరించడం ఒక్క సిద్ధపురుషులకి తప్ప సాధ్యం కాదేమో సుమా!" అంటూ మాస్టరుగారు నావైపు చూస్తున్నారు. ఎనెన సందేశాల సమ్మేళనంగా వ్యక్తమవుతున్న ఆ చూపు నా మనస్సులోని పొరలన్నిటినీ స్పృశిస్తోంది నాగుండెలోని లోతులన్నిటినీ తడి . చూస్తున్నది

మనిషి మనిషిగా బ్రతకగల్గడం, తోటి మనిషిని తన సాటి మనిషిగా చూడగలగడం ఎంత కష్టమో! అలా చూడగలగడానికి ఎంతటి ఒడుపు కావాలో అనిపిస్తూ ఉంటుంది మాస్టారూ! ఇటువంటి సన్నివేశాలు చెప్పినప్పుడల్లా అన్నాన్నేను.

"అలా ఉండగలగడానికి, అలా చూడగలగడానికే య్యా వేద కాలంనాటి నుంచి ఈనాటివరకు పెద్దలు బోధిస్తున్నదీ, సాధనమార్గాన్ని నిర్దేశిస్తున్నదీ."

అనుభూతిప్రదమైన మౌనం నడుస్తూ ఉండగా మాకు తెలియకుండానే మేము నిద్రాదేవి అధీనంలోనికి వెళ్ళిపోయాము.

ఆయనతో గడపడానికి అవకాశం లభించిన ఆ రాత్రులు నిజంగా నవరాత్రులు.... ఏరోజుకారోజు క్రొత్తగా నిత్యనూతనంగా సాగిపోయే ఆ రాత్రులకన్నా నవరాత్రులింకేమి ఉంటాయి?



## నన్నే తప్పిద్దామనా!

ప్రతి సంవత్సరం జనవరి 11, 12, 13 తేదీలలో నిర్వహించబడే గురుపూజా మహోత్సవాలలో మాష్టరుగారు క్రమంగా కొన్ని నియమాలను ఏర్పాటు చేస్తూ వచ్చారు. ఆ సంవత్సరానికా సంవత్సరం పెరుగుతూవస్తూన్న సోదర బృందం సంఖ్యనుబట్టి, సోదర బృందానికి ఆయన ఈయవలసిన శిక్షణనుబట్టి ఈ నియమాలు రూపు ధరిస్తూ ఉండేవి.

ఒక సంవత్సరం "అతిథులు లేరు అందరూ సేవకులే" అని వ్రాయించి ప్రవేశద్వారం దగ్గర కట్టించారు. మరో సంవత్సరం కొందరే ఎప్పుడూ పనిచేస్తూ ఉండడం, కొందరేమో ఎప్పుడూ విశ్రాంతి పేరిట నిర్లక్ష్యంగా తిరుగుతూ ఉండడం గమనించి ఆ పనిచేస్తున్నవారిని ఆడపెళ్ళివారుగా, తాము పనిచేయకుండా తోటి సోదర బృందంచే పని చేయించుకుంటున్న వారిని మగపెళ్ళివారుగా పోల్చి సరసమాడుతూనే మందలించారు. ఈ మగపెళ్ళివారు కూడా ఒళ్ళు వంచి పనిచేయడంలోని సౌలభ్యాన్నీ, సంతృప్తినీ గమనించుకొని వచ్చే సంవత్సరానికి ఆడపెళ్ళివారుగా రూపొందగలరని ఆకాంక్షిస్తున్నాను అంటూ సరసమైన ఆశీర్వచనం చేశారు.

మరొక గురుపూజల నాటికి భోజనశాలకు సంబంధించి ఒక నియమం పెట్టారు. భోజనం పూర్తికాగానే ఎవరి విస్తరి వారు స్వయంగా

తీసివేయాలన్నది ఆ నియమం. కార్యకర్తలను ఈ నియమపాలన విషయమై శ్రద్ధగా చూడమని ఆదేశించారు.

అది ఆ గురుపూజల్లోనే రెండవరోజు. మాష్టరుగారు సోదర బృందంతో కలిసి కూర్చుని భోం చేస్తున్నారు. వడ్డనలవారు వడ్డనలు చేస్తున్నారు. ఒకామె మాత్రం కొంచెం దూరాన నిలబడి మాష్టరుగారి వైపే చూపులను నిలబెట్టి చూస్తున్నది. ప్రక్కవాళ్ళతో ఇలా కబుర్లాడుతూనే అలా భోజనాన్ని పూర్తిచేశారు మాష్టరుగారు. పూర్తిచేసి విస్తరి మడతపెట్టబోతున్నారాయన. ఇంతలో ఆ దూరాన నిలబడి చూస్తున్న ఆమె ఒక్క ఉదుటన వచ్చి విస్తరిపైన వాలింది. ఆమె అందుకనే కాచుకుని నుంచుంది కాబోలు. పనులన్నీ ఆపి ఈ పని కోసమే ఆమె నిలుచుందని అప్పుడు తెలిసింది.

"ఆగండి! మాష్టరుగారూ మీరాగండి! మీరు తీయడమేమిటి? మేమందరం లేమూ!" అంటూ మాష్టరుగారి చేతిలోని మడత పెట్టబడిన విస్తరిని లాక్కోబోయిందామె.

మాష్టరుగారు తన విస్తరిని మరికాస్త గట్టిగా పట్టుకొని చిరునవ్వుతో చిరుకోపాన్ని మేళవించి "ఊఁ తప్పు అలా అడ్డుపడకూడదు. నీ ఉద్దేశ్యమేమిటి? నన్నే నియమాన్నుండి తప్పిద్దామనా? మంచి శిష్యురాలివే".

ఆమె కొంచెం బిత్తరపోయింది అంత చనువుతో వచ్చిన ఆమెకు ఎంత భయం వేస్తోందో ఆమె ముఖమే చెబుతోంది.

విస్తరిని చేత్తో ఒడుపుగా పట్టుకొని రెండవచేత్తో మంచినీళ్ళ గ్లాసు నందుకుంటూ ఇంకా ఇలా అన్నారు మాష్టరుగారు. "ఏమన్నావు నువ్వు, మీరు తీయకండి మేమందరంఉండగా మీరు తీయడమేమిటి అని

అన్నావు అంతేనా? మీరందరూ శ్రద్ధగా నియమాన్ని పాటించాలి అంటే ముందా నియమాన్ని నేను పాటించాలి కదా! అందుకే నువ్వెంత బ్రతిమాలినా నేనంగీకరించలేదు."

మరికొంచెం నవ్వుతూ "నీ ప్రయత్నం ఫలించలేదు కదూ! నన్నే నియమంనుండి తప్పిస్తే ఇక మీరందరూ యధేచ్ఛగా ప్రవర్తించవచ్చును కదా? ఏమంటావ్. అంతేనా నీ ఉద్దేశ్యం"

కాదు అన్నట్టుగా దీనంగా చూస్తూ తలను అడ్డంగా ఊపిందామె. పరిస్థితిని గ్రహించిన మాష్టరుగారు అనునయంగా చూస్తూ "పిచ్చిదానా! ఒకవేళ నీకా ఉద్దేశ్యం లేకపోయినా ఫలితం నేను చెప్పిందే జరుగుతుంది. అందుకనే నిన్ను కొంచెం గట్టిగా వారించవలసి వచ్చింది. నేను మీ ఇంటికొస్తాను. అప్పుడు నీ మనస్సుకు తృప్తి కలిగేటట్లుగా విస్తరి తీసేద్దువు గాని. ఇక్కడ మాత్రం ఇలా సాగనీ" అంటూ ముందుకు సాగారు.

అదో విధమైన అనుభూతిలో అటువైపే చూస్తూ అలానే నిలబడిపోయి ఉంది ఆమె కొంతసేపు.





## బి. వి. యస్. లో చేర రండి

జనవరి గురుపూజల్లో మూడు రోజులూ మూడు విధాలైన శుభ కార్యాలు కూడా నిర్వహింపబడుతూ ఉంటాయి. మొదటిరోజు అక్షరాభ్యాసాలూ, అన్న ప్రాశనలు, రెండవరోజు ఉపనయనాలు, మూడవ రోజు వివాహాలు, మాస్టరుగారి సన్నిధిలో నిర్వహించడమనేది ఒక ఆనవాయితీగా రూపొందింది. అక్షరాభ్యాసాలూ, అన్నప్రాశనలూ మాస్టరు గారు స్వయంగా చేసేవారు. తమ బిడ్డలకు అక్షరాభ్యాసాలూ, అన్న ప్రాశనలూ మాస్టరుగారి చేత జరిపించుకుంటున్నామని సంబరపడుతున్న తల్లిదండ్రులను చూస్తూ ఏం మీరు కూడా చేయమంటారా అని అప్పుడప్పుడు సరసమాడుతూ ఉండేవారు. ఆమాట ఎంతగా సరసంగా ఉన్నదో అంతగా అర్థవంతమైనది. నిజానికా తల్లిదండ్రులు ఏది చూడవలసింది రుచి చూడడం జరిగింది మాస్టరుగారి సన్నిధిలోనే కదా! జీవితంలో దిద్దుకోవలసిన వాటిని దిద్దుకోవడం ప్రారంభించినది కూడా మాస్టరుగారి సారధ్యంలోనే కదా. అందుకనే ఆ తల్లిదండ్రులు "మీరు మాట చేయబట్టేకదా మాస్టరు గారూ మేం వీళ్ళను మీదగ్గరకు తీసుకు రాగలిగాం." అన్నట్లు కృతజ్ఞతా భావంతో మెరుస్తున్న కళ్ళతో తృప్తిగా చూస్తూ తమ బిడ్డలతో పాటు తామూ మాస్టరుగారి పాదాలచెంత మోకరిల్లేవారు.

ఉపనయనాలకూ, వివాహాలకూ సభా ప్రాంగణానికి అల్లంత దూరాన ప్రత్యేకంగా ఒక వేదిక నిర్మింపబడుతుంది. సభా కార్యక్రమూ

లకు ఏ మాత్రం ఇబ్బంది కలగకుండానే ఆ దివ్య క్రతువులు శాస్త్రోక్తంగా నిర్వహింపబడతాయి. ఉపనయన క్రతువు పూర్తికాగానే వటువులు మాస్టరుగారి ఆశీస్సుల కోసం వేదిక చెంతకు బ్రహ్మగారితో సహా వచ్చేవారు. మాస్టరుగారు ప్రవర చెప్పి నమస్కరిస్తున్న వటువుల నమస్కారాలను అందుకొని వారికి గాయత్రిని ఉపదేశించి ఉపనయన ప్రాశస్త్యాన్ని గురించీ, గాయత్రీమంత్ర పరమార్థాన్ని గురించీ వివరిస్తూ ఉండేవారు ఆ వివరించడంలో ఒకింత సరసాన్ని కూడా మేళవించేవారాయన. ఉపనయనాన్ని ఇంగ్లీషులో 'త్రెడ్ మ్యారేజ్' అంటారు. 'త్రెడ్ మ్యారేజ్' ఏమిటి? బహుశ మన మందరం చిన్నతనాల్లో ఉపనయనాలు మానేసి పెళ్ళికిముందు లైన్ క్లియరవడం కోసం మాత్రమే ఉపనయనం జరిపేటందుకు అలవాటుపడ్డాం కదా! మ్యారేజికి ముందు జరిగేది కాబట్టి బహుశా దీన్ని త్రెడ్ మ్యారేజ్ అన్నారేమో అంటూ చిరునవ్వు నవ్వేరాయన. ఇంతకూ ఉపనయనాన్ని 'త్రెడ్ మ్యారేజ్' అనకూడదు. 'త్రెడ్ శాక్రిమెంట్' అనాలి అని మెల్లగా మందలించేవారు.

మూడవరోజున నూతన దంపతులను వేదికపైన ఆశీర్వదిస్తూ ఆ దంపతులు ఎరుగవలసిన సందేశాన్ని సరసంగా లలితంగా అందించేవారు. ఒకసారి ఆశీర్వచన సందర్భంలో నూతన దంపతులవైపు చూస్తూ "మాకొక అసోసియేషన్ ఉంది. దానిలో మీరు కూడా చేరతారని ఆశిస్తున్నాను. మా సంఘం పేరు బి. ఏ. యస్. దానికి నేనే ఫౌండర్ ప్రెసిడెంటుని. అంటే వ్యవస్థాపక అధ్యక్షుడినన్నమాట. ఇదిగో ఈ జి. యల్. ఎన్. శాస్త్రిగారు మా సంఘానికి కార్యదర్శి. సంఘం ఆశయాలకు కట్టుబడడంలో నాకన్న శ్రద్ధతో కృషి చేసి శభాష్ అనిపించుకున్నారు. మా సంఘం పూర్తిపేరు మీకుతెలుసునా? తెలిస్తే మీరు కూడా వెంటనే సభ్యులై తీరతారు. బి. ఏ. యస్. అంటే భార్యా

విధేయ సంఘం అన్నమాట. భర్తలందరూ భార్యలకు విధేయులుగా ఉన్నప్పుడే ఈ సమాజం వర్ధిల్లుతుందని మా సంఘం చాటి చెబుతుంది. ఇప్పటికే చాలామంది సభ్యులయ్యారు. మీరూ చేరండి. నాకు తెలుసు మీరు తప్పక చేరతారు. శాస్త్రిగారూ వీళ్ళ పేర్లుకూడా మన సభ్యుల్లో చేర్చుకోండి. గురుపూజల్లో వివాహమైన యువకులందరూ ఇలా ఈ సంఘంలో సభ్యులవుతారట అని తెలిస్తే ఆడపిల్లలందరూ మాకు గురుపూజల్లోనే వివాహాలు కావాలంటూ పట్టుపడతారు. మాకూ సభ్యులసంఖ్య యధోచితంగా పెరుగుతూ ఉంటుంది. ఈ మూడవరోజున ఇలా మా సంఘాన్ని గూర్చిన ప్రచారానికై కొంత టైమును మాస్టరుగారి దగ్గర నుండి అడిగి పుచ్చుకుంటూ ఉంటాం. శాస్త్రిగారూ సంఘం కార్యక్రమం పూర్తయింది కదా! ఏమిటి ఇక తరువాత కార్యక్రమంలోనికి ప్రవేశిద్దామా" అంటూ ప్రక్కకు జరిగారు. అంతవరకూ చిలిపితనాన్ని వ్యక్తం చేసిన ఆయన ముఖం అంతలోనే గాంభీర్యాన్ని సంతరించుకుంటున్నది. ఇంతవరకు మాట్లాడిన ఆ మాస్టరుగారేనా ఈయన అనిపించసాగింది.

ఏదో పనిమీద వేదికముందు కూర్చున్న నేను వెనుకకు నడచి వస్తున్నాను. ప్రాంగణంలో స్త్రీలవైపు కూర్చున్న అక్కయ్యగారు నన్ను చూచి చిరునవ్వుతో పలకరిస్తూ లేచారు.

"నమస్కారమమ్మా" అన్నానేన్నేను.

"అది సరేకాని మీ మాస్టరుగారిందాక అలా చెప్పేస్తున్నారు కదా! మేమంతా భార్యా విధేయులము అలా, ఇలాగా అని, ఈ వింటున్న పిచ్చివాళ్ళు పాపం నిజమే అనుకోగలరు. నేనూ వచ్చి వేదికపైన రెండు ముక్కలు చెబుదామనుకున్నాను కానీ...." అంటూ అర్థోక్తితో ఆగారావిడ.

"చెప్పాల్సిందమ్మా" అన్నాన్నేను.

"ఎందుకులే చెప్పడం. చెబితే మీ మాస్టరుగారి గురించి చెప్ప వలసి వస్తుంది. శిష్యుల మధ్యలో ఆయనెన్నెందుకు ఇబ్బంది పెట్టడం. అందుకని ఊరుకున్నాను" అన్నారావిడ నవ్వుతూ.

"ఒకవేళ చెబితే ఏమని చెబుతారమ్మా?" అని అన్నాన్నేను.

"ఏం చెపుతాను. ఇక్కడిలా చెపుతున్నారు కానీ మీ మాస్టారు అసలు ఇంటి విషయమేం పట్టించుకోరు అని చెపుతాను. ఏమిటలా నవ్వుతావ్ దొంగలాగా?"

" ఏం లేదమ్మా మీకొక్కవలసినవన్నీ మీకమర్చి పెట్టి కుటుం బాన్ని చక్కగా తీరుగా మీరు నిర్వహిస్తున్నప్పుడు మధ్యలో ఆయన కలగజేసుకోకుండా మీకు వదిలిపెట్టారు అంటే మరి అది నిజంగా విధేయతే కదమ్మా" అన్నాన్నేను.

"ఓరీ! నువ్వన్నీ ఇలాగే చెబుతావు. ఎంతైనా మీ మాస్టరు గారేలే గొప్ప! కానీ!" అన్నారావిడ.

"ఆయనను గొప్పకానిచ్చింది మీరే కదమ్మా! మీరు కలిసి రాక పోతే మీరు ఇల్లు చూసుకోకపోతే ఆయన ఇన్ని గొప్పపనులు ఎలా చేయగలిగేవారు? ఏమంటారు?" అన్నాను.

"ఏమంటాను? కృష్ణస్వామి ఎంతటివారికైనా మాట పెగలకుండా చేయగలడు అంటాను!" అన్నారావిడ.

ఆమె కన్నులు తృప్తితో మెరుస్తున్నాయి. ఆమె వదనంలో ఎక్కడా గోచరించని నిండుదనం ఏదో గోచరిస్తున్నది. బాధ్యతాయుతమైన ప్రేమ రూపుదాల్చినపుడు ఇలా ఉంటుంది కదా! అనిపించసాగింది.

ఇంతలో ఎవరో నన్ను పిలిచినట్లయింది. అక్కయ్యగారి దగ్గర సెలవు తీసుకొని అటువైపు కదిలాను.

"వెళ్లు వెళ్లు నీ శిష్యులెవరో కలవరిస్తున్నట్లున్నారు. నువ్విక్కడ ఉండి పోతే ఎలాగ" అంటూ కదులుతున్న నా భుజంపైన ప్రేమతో తట్టారు అక్కయ్యగారు.



★ ★ ★



"నవ్వుతూ జీవించడం ఒక కళ. ఆ కళ అబ్బకపోతే జీవితానికసలు కళే ఉండదు. జీవితం కళకళలాడాలి, అంటే మనం నవ్వుతూ - ఘనతో ఉన్నవాళ్ళను నవ్విస్తూ ఉండగలగాలి ...

"మనం ఎవరిమీద సరసమాడుతున్నామో ఆ వ్యక్తికూడా మనతోపాటు మనంతగానూ నవ్వుకోగలగాలి. అప్పుడు సరస మాడటం మనకు చేతవచ్చినట్లు లెక్క...

"ప్రవక్తల సరసంలో ఒక సహజమైన దివ్యత్వం ఉంటుంది. మంచిపువ్వుకున్న పరిమళం లాంటిదది. వారి సరసం ఎంతగా సంతోషాన్ని కలిగిస్తుందో అంతగా ఎదుటివారిని సంస్కరిస్తుంది కూడా!

...నిజమైన గ్రంథాలు రచయితలచేత వ్రాయబడవు. ప్రజలు కోరి నిలచినపుడు రచయితలనుండి అవి వెలువడతాయి!

